# ప్రణయోపాసి

(ఇతర కథలు)




రచన

వైశంపాయన

ప్రచురణ

యువ సాహితీ సమితి

అంకితం

శ్రీ గుడిపాటి వెంకట చలం గారికి

ఈ సంపుటిలో




# 1

## జారులు - చోరులు

రాణాలో కొట్టిన రెండు గంటలూ గాలివాలున వినవొచ్చాయి. గుడిలోని కార్తీక దీపాలు ఆఖరిసారి ఆవులించి చీకట్లను కప్పుకుని కునుకు తీసాయి. మంచు తెర పరిసరాల్ని తృప్తిగా తాకి మత్తెక్కి తిరుగుతోంది. సత్రం వసారాలో పడుకున్న కుక్క రబ్బరుకు మల్లే సాగి, 'భోయ్' మని అరచింది. ఆ చివరగా కూర్చుని తత్వ చింతన చేస్తున్న బైరాగి దాని వంక కోపంగా చూచి 'ఛూ' అని ఉమ్మేశాడు. వసారాలో వ్రేలాడుతున్న దీపం గాలి పాటుకు ఊగుతూ గోడలమీది నీడల్ని వికృతంగా కదిలిస్తోంది.

వసారాలోకి ఒక వ్యక్తి వొచ్చి దీపపు కాంతి చాలక అగ్గిపుల్ల గీసి, పైకండువాతో నేలను దులిపి, దాన్ని నేలమీద పరచి పడుకున్నాడు. అతను చలిని బాధగా చూచాడు. మరి గత్యంతరం లేదంతకన్నా: కొంచెం దూరంలో దుప్పటి కప్పుకుని పడుకున్న వ్యక్తి, దుప్పటి తొలగించి, ఆ వొచ్చిన వ్యక్తి కేసి ఒకసారి

చూచింది. దుప్పటి తొలగించటంలో గాజులు గలగల మన్నాయి.

పడుకున్న వ్యక్తి తాలూకు బీడీ వాసన గుప్పు మంటోంది. బీడీ నిప్పు కెంపుకు మల్లే మెరుస్తోంది. బయట దట్టంగా వ్యాపించిన మంచు, చలిగాలి...సందు దొరికితే చలి కాటేస్తోంది. ఆమె దుప్పటి సందు లేకుండా చేసుకుని—

'ఇప్పు డెంతైంది?' అన్నది.

'ఆఁ' అన్నా డతను సరిగా వినిపించక పోవటం మూలాన.

'ఇప్పు డెన్ని గంటలై వుంటుంది?' అన్నది.

'రెండు' అన్నా డతను.

'ఏ వూరు మీది?' అని ప్రశ్నించింది.

'మాదా—మాది చాలా దూరం. కొంచెం పని మీ దొచ్చాను.' అన్నా డతను. చలి అతన్ని పడుకో నివ్వలేదు, లేచి కూర్చొని—

'ఛీ. వెధవ బ్రతుకు. దానిదుంప తెగ...దాని మూలంగా యిన్ని అగచాట్లొచ్చాయి.' అని తాను అనుకున్నాడు. కానీ ఆ మాటల్ని అతను అతని మనస్సు లోనే అనుకుంటే సరిపోను. ఆమె వినాలనీ— 'ఎవరు? ఏమిటి'? అని ప్రశ్నించాలనే ఉద్దేశ్యంతోనే, ఆమెకు వినిపించేస్థాయిలో అన్నాడు. అతను ఊహించినట్లుగానే—

'ఎవరండీ?' అన్నది కొంచెంగా దుప్పటిని తొలగించి.

'ఆఁ. అది ఏమంత చెప్పదగ్గది కాదు.' అన్నాడు. తన కంఠములో విరక్తి భావాన్ని వ్యక్తీకరించేలా అదో మాదిరిగా. ఆమె తిరుగా ఏమీ మాట్లాడలేదు. అతను బీడీని ఆఖరిసారి పీల్చి వసారా బయట పడేలా విసిరాడు. ఆమె మాట్లాడక పోవటంతో కొంచెం దెబ్బతిన్నవాడిలా గతుక్కుమని, ఆమె అడక్కపోయినా తనే చెప్ప దలచుకుని—

'నేను ఒక మనిషిని చేరదీశాను. అది యింత దూరం తిప్పుతున్నది. ఇవ్వాల్టితో దాని ఆశ వొదులు కున్నాను. ఎలాగైనా రేపు యింటికి చేరాలి.' అన్నాడు; ఆమె తిరిగి ప్రశ్న వేయటానికి సంశయాన్ని కల్గించే టట్లుగా.

'ఏమి చేసింది?' అన్నది దుప్పటిని సరిగా కప్పు కుని ఇటుకేసి తిరిగి.

'చెయ్యటాని కేముంది. చూడు! నువ్వూ ఆడ దానివే కదా! ఒక్క సంగ తడుగుతాను, న్యాయం చెప్పు' అన్నాడు కొంచెం ప్రార్థనా పూర్వకంగా. ఆమె ఏమీ మాట్లాడలేదు. అతను ఒక్క క్షణం ఆమెవొంక చూచి—

'సంసారమన్నాక కొద్దోగొప్పో లోపాలుంటాయి. అవునా?' అన్నాడు.

'అయ్యో! అదేమిటండీ. విధిగా వుంటాయి.' అన్నది సానుభూతిగా.

'ఆఁ. నిజం చెప్పావు. ఎవరివల్లనో పొరబాటున్నా దాన్ని యింకోరు సర్దుకోక పోతే సంసారంలో గుట్టే ముంటుంది? నావల్లే తప్పు జరిగిందనుకో, అలిగి ఎటో పోయింది. దాన్ని ఎలా చూచేవాడి ననుకున్నావు! పువ్వు కాక ఎత్తుగా చూచేవాణ్ణి,' అన్నాడు అతను.

'అంతయిల్లు వొదలాల్సిన తప్పు మీారేంచేశారు? అని ప్రశ్నార్థకంగా చూచిందామె.

'అదే చెప్పబోతున్నాను. నువ్వే అడిగావు. నాకు యిది వరకు కొంచెం తాగే అలవాటుంది. దీన్ని చేర దీసిన తరువాత దాని చివాట్లతోనే కాస్త మంచి మార్గం లోకొచ్చాను. ఊరుకొన్న వాడిని ఊరుకోలేక పోయాను. ఆ బజారు వెంట వొస్తుంటే పాతబుద్ధి ఆ పాడు పని మళ్లీ చేయించింది. కాస్త తాగి గుట్టు చప్పుడుగా పడుకుందా మనే ఉద్దేశంతోనే పోయాను. కానీ బాగా తాగాను గామోను, యింటికెళ్ళి, దాన్ని బాగా కొట్టానట-అంతే యింటినుంచి లేచిపోయింది.' అన్నాడు అతను జేబులో నుంచి బీడీని అగ్గిపెట్టెను తీస్తూ.

'అంతమాత్రానికే యిల్లు వొదలి పెట్టిందంటే నాకేం నమ్మకం లేదు.' అన్నది సంశయంగా.

'నిజమే! చూడు. పదిమంది కట్టిన ఇంట్లో వుండి

చెప్తున్నాను. అబద్ధమాడితే తల పగిలి పోవాలి. ఎన్నో చోట్ల తిరిగాను. విసుగెత్తి పోయింది' అని ఆమె కేసి సాలోచనగా చూచాడు.

'నిజమే కావొచ్చు. నా సంగతే చూడు— ఆయన పొద్దు నసగా వొస్తానన్న మనిషి; యింతవరకు అంతు లేదు. ఉదయంనుంచి తిండి లేదు. ఈసత్రంలో వుండమని చెప్పి వెళ్ళాడు. చూచీ చూచీ కళ్ళు కాయలు కాసినయ్యంటే నమ్మండి. కంటిమీద వొత్తి వేసుకుని పడుకున్నాను. ఇందాక మీరొచ్చినప్పుడు అలికిడైతే చూచాను. నిజంగా ఆయనేమో ననుకుని ప్రాణాలు లేచి వొచ్చాయంటే నమ్మండి.' అన్నది.

ఆయన ఏ పనిమీద ఉన్నాడో!' అన్నా డతను బీడీపొగ పైకి వొదులుతూ.

ఆమె లేచి, దుప్పటి శరీరాని కంతకూ కప్పుకుని గుంజ కానుకుని కూచ్చుంది. అతను ఆమెవేపు ఆదీపపు మసక కాంతిలో చూచాడు. నల్లగా వున్నా బాగానే వున్నదని అతననుకున్నాడు. తన చేయిచాస్తే అందుబాటులో వొంటరిగా స్త్రీ, ఒక చెంప చలి... యీ రెంటికి తోడు దూరంగా నిద్రపోతున్న సాధు తప్ప, తక్కిన పరిసరమంతా నిర్జనంగా వుండటం, యీ పరిస్థితుల ప్రభావానికి అతనిలో ఒక వింత సంచలనం కలిగింది. ఆ సంచలనం కలిగే సరికి అతని

శరీరంలో ప్రతి అవయవము బిగ్ర బిగుసు కున్నాయి. నరాలు నెప్పులతో 'కిర్ర్' మన్నాయి.

మొత్తంమీద తన ఎదురుగా వున్న స్త్రీ విషయంలో తను భయపడాల్సిన అవసరం అతనికి అంతగా గోచరించ లేదు. ఆమె మాటల ధోరణి చూస్తే, ఆమె యింకోరికోసం కనిపెట్టుకొని ఉన్నట్లు తెలుస్తూనే వుంది. ఆ వ్యక్తి రానే లేదు. తను చెప్పిన విషయాల్లో తను మంచి వాడననే చెప్పుకున్నాడు. తను ఆమెకు చెప్పిన విషయం కార్య సాఫల్యాని కుపకరించదని అతను అనుకొని ఆమెను తన ధ్యేయం వైపుకు ఎలా మరల్చాలో పది నిముషాలపాటు ఆలోచించాడు. చివరకు—

'మరి యిప్పుడేమైనా కొట్లుంటాయా?' అన్నాడు.

'ఉండవు. రెండో ఆటకూడా వదలి గంటపైగా కావొచ్చింది.' అన్నది.

'అయ్యో పాపం! మరి పొద్దుటి నుంచి ఏమీ తినలేదంటివి గదా! ఆకలి కావటం లేదా?' అన్నాడు. ఆమె సన్నగా నవ్వి, పొడిగా దగ్గింది.

'ఆకలిగానే ఉంది. ఉంటే ప్రయోజనం?' అన్నది వింతగా చూస్తో.

'పోనిలే. ఈ రూపాయి తీసుకుని ఉదయమే కాఫీ తాగు. పాపం! ఎంత ఆకలిగా వుందో! ఎవరికైనా ప్రాణమే! తరువాత అతను వొస్తాడుగా?' అని అతను

లేచి జేబులోనుంచి రూపాయి తీసి ఆమెకు యిచ్చాడు. ఆమె దుప్పటిలో నుంచి చెయ్యి తియ్యకుండానే—

'ఒద్దులెండి. పాపం మీదీ పొరుగూరంటిరి.' అన్నది.

'కష్టాలు మనుషులకు రాక మానులకొస్తాయా! ఫరవాలేదు తీసుకో.' అని చేయి చాపాడు. ఆమె దుప్పటిలో నుంచి చెయ్యి బయటికి తీసి రూపాయందుకుంది. ఆమె అరచేయి అతనికి మంచుగడ్డలా తగిలింది. ఆమె రూపాయిని బొడ్లో దోపుకున్నప్పుడు గాజులు గలగలమన్న ధ్వని మందంగా వినిపించింది. తరువాత ఆమె మెదలకుండా, గుంజ కానుకుని, యిదివరకటి లాగా నిశ్చలంగా కూర్చునివుంది. కనీసం ఆమెనుంచి 'ఇలా' సమాధానం వొస్తుందని ఊహించిన అతని ఊహ కరిగిపోయింది. అతనికి ఏమీ పాలుపోక మాట్లాడకుండా వుంటే కాలం ఐపోతుందని, చివరకి—

'చలిగా వుంది!' అన్నాడు.

'ఆఁ. గుమస్తా ముండాకొడుకున్నాడంటే పరమ ఛండాలుడు. వట్టి వెధవ. అందరి మీదా విరుచుకు పడతాడు. వసారాలో కూడా పడుకోనివ్వడు. యీ సత్రం వాడి తాతసొమ్మైనట్లు,' అన్నది.

'ఉంటారు, ఉండరుమరి. ఊరికి ఒకరిద్దరు లేకపోతే ఎలా?' అన్నాడు అతను.

దీపం సత్రపు గుమస్తా నూనె పోసినమేరకు వెలిగి క్రమేణా తగ్గుస్థాయిపట్టింది. బర్నరులో మాత్రం కొద్దిగా వెలుగుతోంది. వసారా అంతా చీకటి పులుముకుంది. ఆమె ముఖం అతనికి కనిపించటం లేదు. తెల్లగా నున్నపు రాసికివల్లే, గుట్టగా కనిపిస్తోంది ఆమె ఆకారం. అతని లోని కోరిక కట్టలు తెంచుకు ప్రవహిస్తోంది. మనిషి ఎందుకో జ్వరం తగిలిన వాడిలా ముంచుకుపోయి కూర్చున్నాడు. మోకాళ్ళమీద తల ఆనించి అటుకేచి చూస్తో వున్న ఆమెను చూస్తో, ఆమెను పొందటం ఎలా అనే ధ్యేయంతో ఉక్కిరి బిక్కిరౌతున్నాడు.

'దుప్పటి పెద్దదేనా? చలిజాస్తి అయింది' అన్నాడు చివరికి తెగించి. దుప్పటిలో చోటు యిచ్చిందా—ఆమెను పొందటం తేలిక అనే ఉద్దేశ్యంతో.

'పెద్దదే'

'ఒక చివర కప్పుకో నిస్తావా ? చలి పీక్కు తింటున్నది.' అన్నాడు.

'ఇంకో రూపాయి వుంటే యివ్వండి. రేపు ఆయన రాగానే యిప్పిస్తాను.' అన్నది.

'ఆఁ. ఇవ్వకపోయినా ఫరవాలేదు.' అన్నాడు ధీమా ఉట్టిపడేస్వరంతో. దుప్పటి చేత్తో అందుకునే ప్రయత్నంలో ఆమె అతని ప్రయత్నాన్ని అభ్యంతర పెడుతో—

'ఇక్కడ కాదు. ఆ గుమస్తా దయ్యం వొచ్చిం దంటే రక్కుతుంది' అన్నది.

'సరే పద.' అని అతను లేచి కండువాను తలకు చుట్టుకున్నాడు. ఆమె దుప్పటిని ఘోషాలా కప్పుకుని ముందు నడిచింది. అతను ఆమె ననుసరించాడు. సత్రం ప్రక్కనే కాలువనీరు దూకుతున్న శబ్దపుహోరు వినవస్తోంది. అతను పైగుడ్డ నేలమీద పరిచాడు. ఆమె ఒక్క క్షణం నిల్చుని, అతని ప్రక్కనే కూర్చున్నది. అతను ఆమె భుజంమీద చేయి వేసాడు. రథంచాటు కావటం మూలాన చలి కొంచెంగా తగ్గింది.

'ఇంకో రూపాయి...' అన్న ఆమెమాట పూర్తి కానివ్వకుండానే—

'ఉదయమే యిస్తాను. ఐదు రూపాయల నోటు వుంది' జేబు నలిపాడు. కాగితం కరకర మన్నది. ఆమె యిక మాట్లాడలేదు. ఆమె భుజాన్ని చేత్తో లాగాడు. ఆమె మెల్లిగా అతని ప్రక్కకు వొరిగింది. ఆమె నడుముచుట్టూ తన చేత్తో పెనవేసి బలంగా తనలోకి లాక్కున్నాడు.

'మీరన్న మనిషి నిజంగా లేచిపోయిందా?' అన్నది.

'ఆఁ. దేవుడి తోడు. వందరూపాయలు లారి పోయాయి.'

'పాపం!'

'ఈ ఐదు రూపాయలే వున్నాయి. నీకు రూపాయి పోతే నాల్గు రూపాయలతో యింటికి చేరుకోగలను' అన్నాడు.

'కొన్ని చండాలపువి వుంటాయి. వాటి ఖర్మ వాటిది!' అన్నది.

'పోనీ నువ్వు రారాదా?' అన్నాడు.

'చూడండి. అతను నన్ను చేరదీసి పది సంవత్స రాలైంది. ఎలా రాను! ఇప్పుడిదేమి టంటారా? నేను మీ దగ్గర మొదట రూపాయి తీసుకోని కారణం అదే. అతనికి ద్రోహం చెయ్యటం యిష్టంలేదు. అవసరానికి ఏదో కొద్దిగా సహాయం చేశారు. మీ మాటల ధోరణి చూస్తే..... ఎంతగానో ఆలోచించాను. చివరకు మీ మనస్సు నొప్పించలేక, ప్రాణాలన్నీ చంపుకుని తలొగ్గాను' అన్నది.

అతను ఆమెను బలంగా, గాఢంగా తనలోకి లీనం చేసుకోవాలనే ప్రయత్నంలో, అలుపువల్ల ఉచ్ఛ్వాస నిశ్వాసాలు పాము బుసకు మల్లే విడుస్తూ రొప్పుతున్నాడు. వసారాలో పడుకున్న కుక్క చలికి 'గుజ్జు' మంటున్నది. బైరాగి వొదులుతున్న గంజాయి వాసన ఏదు వాసనగా వొస్తో వుంది.

అరగంట గడిచింది. అతను దుప్పటి ముసుగులో

నుంచి బయటకొచ్చి, చొక్కా పంచే దులుపుకుని, కండువా భుజాన వేసుకుని—

'కాఫీ హోటళ్ళు తీసినట్టున్నారు. నేను యిన్ని తాగి, నీకు చిల్లర తెచ్చిపెడతాను' అన్నాడు.

'సరే, తొందరగా రండి' అన్నది.

'ఒక్క క్షణంలో వస్తాను.' అని రథం క్రిందగా దోగాడుతూ వొచ్చి, బజారు వైపు నడిచాడు.

'దొంగ వెధవలు, అన్నీ అబద్ధాలే. లేచి పోయిం దట. వీడు వెతకటానికి బయలు దేరాడుట. మా 'ఆయన' ఎంత నిజమో—వీడి 'ఆవిడ' కూడా అంతే నిజమైవుంటుంది! ఏమోలే, ఆ రూపాయికూడా వొస్తే ఆయింటి దాని ముఖాన వెయ్యాలి. దాని గోడు మరీ ఎక్కువైంది. ఆ టీకొట్టు వెధవ—వాడి బిసాడుకు వాడు—ఒక్క అణా టీ అప్పు పెట్టమంటే ఎగిరిపడ్డాడు. ఈ వూరొచ్చినప్పుడు తిండికి లేక యీ వసారాలో పస్తులున్న వెధవకు నాల్గు రూపాయలు కూడేసరికి కళ్ళు నెత్తిమీంది కొచ్చాయి. వాడి మొహాన రూపాయిపడేసి టీ కలపమంటాను' అనుకున్నదామె. దుప్పటి తీసి దారివొంక చూచింది. బావిదగ్గర ఎవరో స్నానం చేస్తున్నట్లుగా వుంది. పెంకుటి వసారా వెనుక ఆకాశం తెల్లబడుతోంది. ఒకటి రెండు హోటళ్ళ రేడియోలు గోలచేస్తున్నాయి. సత్రపు పని మనిషి వసారా వూడుస్తున్న చప్పుడు.

'వెధవ. దోవ పుచ్చుకున్నాడు.' అని అనుకుని రథం క్రిందగా దూరి వసారాలోనుంచి బావి దగ్గర కొచ్చింది. స్నానం చేస్తున్న అతను—

'ఏం వదినా! పెందలాడే లేచావేం?' అన్నాడు వణుకుతో.

'నిద్ర పట్ట లేదురా మరిదీ!' అన్నది వెక్కిరిస్తూ.

'రాత్రి...యేమైనా?' అన్నాడు.

'పోరా నీ జిమ్మడ...కాస్తబొగ్గుంటే పెట్టుదూ' అన్నది.

'ఆ అరుగు చివరుంది 'అన్నాడు తుడుచుకుంటూ.

కంకరరాతితో బొగ్గును పొడిగాచేసి పళ్లు తోము కుంటూ నుంచున్న ఆమెతో—

'కాస్త టీ పోయిద్దూ నీ పుణ్యా ముంటుంది' అన్నాడు స్నానం చేస్తున్నతను.

'తాగరా! పోయిందేముంది' అన్నది. అతను తోడియిచ్చిన నీళ్ళతో ముఖం కడుక్కుని బజారువైపు నడిచింది. పోతున్న ఆమెను ఆపి —

'జోరుగావుందే—రాత్రి మంచిఛాన్సు తగిలిందా ఏం?' అన్నాడు.

'ధూ! నీ బొంద' నవ్వుకుంటూ నడచింది.

టీ కొట్టు దగ్గర జనాన్ని తప్పుకుని లోపలికి పోతూ—'ఒక టీ కలుపు' అన్నదామె. టీ కలిపి ఆమె

కిస్తా— రూపాయి గల్లాలో వేసుకోబోయి, ఒక్క—క్షణం రూపాయి కేసి చూసి తిరుగా టీ గ్లాసును బల్లమీద పెట్టి 'తెల్లవారి వొచ్చావేం? అమావాస్య చీకట్లో రాకపోయావా బాగుండేది! ఎవరో గుడ్డి వెధవకియ్యి. లేకపోతే దారం గుచ్చుకుని మెళ్ళో వేసుకో. మనకే వేయఁబోయావూ బిత్తరు?' అని రూపాయి ఆమెముందు పడేలా విసిరాడు.

ఆమె దాన్ని అందుకుని చూచింది. నల్లగా పెంకుకు మల్లే వుంది. శ్వాస బరువుగా నోటితో వదలి—

'లుచ్చా... రెండేళ్ళు మంచంలో పడుకునే సామగ్రి పట్టు కెళ్ళాడులే' అనుకుని తృప్తిగా కాలవవైపు నడిచింది.



## 2

# మేడిపళ్లు

"ఇదుగో! మీరు లక్ష చెప్పండి, దయ్యా లున్నాయంటే నాకేం నమ్మకంలేదు' అని ప్రకాశరావు కుర్చీలో సరిగా జరిగికూర్చొని టేబుల్ మీదున్న సిగ రెట్టు టిన్ను వంగి అందుకున్నాడు.

'మిమ్మల్ని నమ్మమని నేనటంలేదు. అయినా మీరు నమ్మకపోవటంలో వింతేమీలేదు. బస్తీ నాగరిక తలో పెరిగిన మీకు దయ్యాలను గురించి ఏమీ తెలియ దనాలి. కానీ వున్నాయి.' అన్నాడు రిటైర్డ్ రెవెన్యూ ఇన్స్పెక్టరు కాంతయ్య.

క్లబ్‌లోని జనం వీరి వాదనలో పంచిన పేకను నిర్లక్ష్యంగా ఆడుతున్నారు. కాంతయ్య సిగరెట్టు ముట్టించి, పొగను పైన తిరుగుతున్న ఫాన్ గాలిలో వొదిలాడు. గాలి తీవ్రతలో పొగ క్షణంలో అదృశ్యమై పోయింది.

'పోనీండి. మీకు నా కండ్లారా చూచిన విష యం చెప్తాను. నేను కొత్తగా ఉద్యోగంలో చేరిన రోజుల్లో ఒక పల్లెటూరికు వెళ్ళాను. రాత్రి బాగా పొద్దు

పోయింది. లఘుశంకకని బయటి కొచ్చాను. ఆ యింటి ముందు పెద్ద వత్తిచెట్టు. ఆ చెట్టుదగ్గర...

కాంతయ్య మాటను ఆపి— 'అడుగో డాక్టర్. హల్లో డాక్టర్ సాబ్, రండి, యిలా, యీ కుర్చీలో—' అని ఉత్సాహంగా ప్రకాశరావు డాక్టర్ను ఆహ్వానించాడు. డాక్టరు కోటును కుర్చీకి తగిలించి, స్టెతస్కోపు బల్లమీద పెట్టి, ప్రకాశరావు చూపిన కుర్చీలో కూర్చున్నాడు. ప్రకాశరావు అందించిన టిన్ నుంచి డాక్టరు సిగరెట్ తీసి ముట్టించాడు.

డాక్టర్ అందరివైంక ఒక్కసారిచూచి, ప్రకాశరావును వింతగా చూస్తో— 'మొత్తంమీద ఏదో హడావుడిలో వున్నారే?' అని ప్రశ్నించాడు.

'నిజమే. మిస్టర్ కాంతయ్య దయ్యాలున్నాయనీ, నేను లేవనీవాదన. ఇరుపక్షాలు సమాన బలంగా వున్నాయి. మీరు ఎటుమొగ్గుతే అటు గెలుపు. మరి మీరు...' అని ప్రకాశరావు డాక్టరువైంక ఆశగా చూచాడు.

డాక్టరు బాయ్‌ని కేకేసి సోడా తెప్పించి, అణా యివ్వబోయినాడు. ప్రకాశరావు డాక్టర్ను వారిస్తూ తనే అణా యివ్వబోగా, డాక్టరు అతనిచేతిని బలంగా వెనక్కునెట్టి, నవ్వుతూ—

'నన్ను ఇన్‌ఫ్లూయన్స్ చేయనక్కరలేదు' అన్నాడు.

'ఓ సరే.' అని ప్రకాశరావు కుర్చీలోకి మామూ లుగా జరిగి కూర్చుని, సిగరెట్టు ముట్టించాడు.

ప్రకాశరావు సిల్కుతప్ప నూలుగుడ్డ కట్టగా ఆ క్లబ్‌లో ఎవ్వరూ చూడలేదు. అతను జల్సాపురుషుడని అందరికి తెలుసు. కానీ అతను ఏంచేసేదీ ఎక్కడుండేదీ లాంటి వివరాలు క్లబ్‌లోని చాలామందికే తెలియవు. డాక్టరు మెదలకుండా కూర్చోటం చూచి—

'చెప్పండి డాక్టరుసాబ్' అని హెచ్చరించాడు ప్రకాశరావు. డాక్టరు నాగరికతలో పెరిగినవాడు. అందు లోనూ పల్లెటూరి వాతావరణాన్ని ఎప్పుడూ చూచిన వాడుకాదు. కాబట్టి, డాక్టరు ప్రకాశరావు పక్షానే చెప్తాడనీ తను యింతమందిలో వోడిపోతాననీ ఆలో చించుకుని, దిగాలుపడి, కుర్చీలో కుంచుకుపోయి కూర్చు న్నాడు ఇన్‌స్పెక్టరు కాంతయ్య.

డాక్టరు గొంతు సరిచేసుకుని-'సరే, నా ఉద్దేశ్యం కూడా వున్నాయనే. ఉండటమే కాదు! నా కండ్లారా చూచాను!' అన్నాడు.

కాంతయ్య తను ముసలివాడనే సంగతే మరచి పోయి, కుర్చీలోనుంచి చువ్వల్లే ఎగిరి—'గ్రేట్ సక్సెస్, గ్రేట్ సక్సెస్! బాయ్ కలర్స్, కలర్స్!' అని హాలు ప్రతిధ్వనించేలా అరిచాడు.

'నో, నో, నేనొప్పుకోను. మీకూ కాంతయ్య

గారి కున్న స్నేహాన్ని పురస్కరించుకుని, వారు వాదించటం యిష్టంలేక యిలా చెప్పారు,' అని కుర్చీలోనుంచి లేచి వెళ్ళబోతున్న ప్రకాశరావు డాక్టర్ను బలవంతంగా కూర్చోపెట్టి—

'కోప్పడకు మిత్రమా! ఒక్కక్షణం కూర్చో, నేను చెప్పింది విను. తరువాత నీ యిష్టం' అని తన కోటు జేబులో వున్న డైరీనితీసి, పేజీలు అటూ యిటూ త్రిప్పి, ఒక పేజీ నిర్ధారణచేసి—

'చూడండి లాయర్ గారు, యిక్కడ యిలాంటి వాదన జరుగుతుందనీ, వాదన సౌలభ్యంకోసం యిది వ్రాసింది కాదుకదా?' అని ప్రశ్నార్థకంగా లాయరు కృష్ణమాచారి ముఖంలోకి చూచాడు.

'యువర్ ఆనర్' అని నాలుక కొరుక్కున్నాడు. క్లబ్ లోని వారంతా పెద్దగానవ్వి, చప్పట్లు కొట్టారు. లాయరు ముఖం ఇలెక్ట్రిక్ బల్బ్ వీక్లీ చాటున దాక్కుంది.

'చూడండి. యిదుగో, లాయరుగారు, దీన్ని చదవండి.' అని డాక్టరు అందించిన డైరీ అందుకున్నాడు. మళ్ళీ అందరూ నవ్వారు.

'మే, పదహారు. నేనారాత్రి దయ్యంతో గడిపాను!' అని లాయరు చదివాడు.

'నేనొక విషయం చెప్తాను. యిది జరిగి అట్టే కాలంకూడా కాలేదు. అంతా లెఖ్ఖ స్తే పదిహేను

రోజులు. చెప్పమంటారా?' అని డాక్టరు అందరివైంకా ఒకసారి కలయచూచాడు.

'డాక్టరుగారు చెప్పాలి.' అని పోలీసు ఇన్స్పెక్టరు పేకను బొత్తిచేసి కిటికీలోకి గిరాటువేసి టేబుల్ క్లాత్ క్రిందవున్న డబ్బును జేబులో వేసుకున్నాడు.

'అవసరంలేదు. నేను వినను.' అని లేవబోతున్న ప్రకాశరావుని బలవంతంగా కూర్చోపెట్టి—

'వినండి. నాకు బాగాగుర్తు. ఆ సీను యిప్పటికీ నా కళ్ళలో కనిపిస్తున్నది. రాత్రి పదకొండు దాటింది. వీధి తలుపు ఎవరో చప్పుడు చేసారు. 'అబ్బా, యీ రోగులు నిద్రపోరు', అనుకుంటూ తలుపు తీసాను. టైఫాయిడ్ రోగి తాలూకు మనిషి. బ్యాగ్ అతనికిచ్చి యిద్దరమూ బయలు దేరాము. సెంటరులో ఒక్క జట్కాగానీ, రిక్షాకానీ దొరకలేదు. మబ్బు దట్టంగాపట్టి, చల్లటిగాలి వీస్తోవుంది. వర్షం కురిసే సూచనలు బాగా కనుపిస్తున్నాయి. దారిలో కొచ్చాక గొడుగు గుర్తు కొచ్చింది. అందులోనూ యీ వేషానికి గొడుకు్క పొద్దెదురనే సంగతి శ్రోతలకు విదితమే.'

'హియర్, హియర్' అని ఆ మూలనుంచి కేక వేసారు.

'రోగికి ఇంజెక్షన్ యిచ్చి, వారికి యింకా కొన్ని సలహాలు చెప్పి, బయటికొచ్చి చూచాను. చినుకులు

అప్పుడే ప్రారంభమైనాయి. రోగి తాలూకు వాళ్ళనడిగి గొడుగు తీసుకుని యింటికి బయలుదేరాను. నా వెంబడి రోగి తాలూకు మనిషి వొస్తాననా్న అభ్యంతరపెట్టి వొక్కర్నే బయలుదేరాను. చినుకులు నా గొడుగుమీద పడి పల్చటి శబ్దం చేస్తున్నాయి. గిలకోళ్ళధ్వని గాలి వాలున అంచెలంచెలుగా వొస్తోవుంది. కోర్టుదాటి లేడీస్ క్లబ్ దగ్గర కొచ్చాను.

'ఏమండోయ్.'

'నన్నేనా పిలుస్తున్నది !' అనుకుని వెనక్కితిరిగి చూచాను. క్లబ్ గేటుదగ్గర ఎవరో స్త్రీ నుంచునివుంది. నా అనుమానం ధృవపడక ముందే...,

'మిమ్మల్నేనండి' అన్నది.

'నేను ఆమె సమీపానికెళ్ళాను. 'రోజ్' వాసన నన్ను పెనవేసుకుంది. ఆమె అవసరాన్ని క్షణంలో గుర్తించి గొడుగును ముందుకుజాపాను. నా గొడుగులో కొచ్చింది. యిద్దరముకలసి రోడ్డు ప్రక్కగావున్న దీపాల క్రిందగా, నీడల్ని పొడుగ్గానూ, పొట్టివి, వికృతంగానూ చేసుకుంటూ నడుస్తున్నాము. ఆమె తల్లోని సన్నజాజుల పరిమళం అప్పుడప్పుడు నా ముక్కుల్లోకిదూరి మనస్సును వికలం చేస్తోవుంది.

'మీరు.....అన్న నా మాటని పూర్తికానివ్వకుండానే—

'ఆఁ. నేను యీ లేడీస్ క్లబ్ సెక్రటరీని...క్లబ్ యానివర్సరీ జరుగుతుంది. దానికి కావాల్సిన అరేంజి మెంట్సుకు ప్లాను వెయ్యటంలో యింత ప్రొద్దుపోయింది. ఫ్యాన్ యింట్లో ఎవరికో జబ్బుగావుందని పెందలాడే వెళ్లాడు' అన్నది.

'ఓ! అలాగా!' అన్నాను. ఆమె శరీరం నాకు తగులుతున్నప్పుడల్లా నాలోని కోర్కెలు, వాంఛలు తీవ్రరూపం దాల్చుతున్నాయి. ఆమె అన్నది—

'మీరు డాక్ట...!' అని తడబడింది.

'ఆఁ... డాక్టరు రమాకాంత్' అన్నాను. ఆమె నడుస్తూనే నా ముఖంలోకి సంతోషంగా చూస్తూ—

'ఆఁ జ్ఞాపక మొచ్చింది. మిమ్మల్ని ఒకటి రెండు సార్లు చూచిన గుర్తు' అన్నది.

'రోడ్డుమీద పడ్డ వాననీటిలోకి, దీపాలకాంతి, వాన చినుకుల్లోనుంచి, నీరసంగా జారి, మిలమిలా మెరుస్తూవుంది. నాలోని కోర్కెలు కట్టలు తెంచు కున్నాయి. ఆమెను పొందాలనే వాంఛ ఉధృతంగా పని చేస్తోంది. ఒక చెంప భయంతో గుండెలు వేగంగా కొట్టు కుంటున్నాయి. నేను ఏవేవో ఊహలు చేసుకుంటూ నడుస్తున్నాను. ఆమె ఆగి—

'ఇదేనండి మాయిల్లు' అన్నది.

'ఇద్దరం కలసి మెట్లెక్కాము. తాళంతీసి లోని

కెళ్ళి స్విచ్ ఆన్ చేసింది. గదిలోని చీకటిని మ్రింగింది కాంతి. నేను యింకా వాకిట్లోనే నుంచున్నాను. 'రండీ' అన్నది. లోపలికెళ్ళాను.

'ఇలా రండి. యీ కుర్చీలో'—

'ఆమె చూపించిన కుర్చీలో కూర్చున్నాను. నాలో ఆలోచనలు ఎంత త్వరగా పుట్టుతున్నాయో, అంత త్వరగానే గిట్టటంకూడా జరుగుతున్నది. అట్టే కాలం అలా కూర్చోటం మర్యాద కాదని లేచినుంచుని, 'వొస్తానండి' అన్నాను.

'అయ్యో, సారీ. కాస్త కాఫీ తీసుకోండి.'

'అని, టేబిల్ మీద వున్న ఫ్లాస్కులోని కాఫీని కప్పులో పోసి నాముందుంచింది. తాగాను. 'చాలా ప్రొద్దుపోయింది వొస్తాను.' అని లేచాను

'పాపం! మీరు చాలాదూరం పోవాలికదా. అభ్యంతరం లేకపోతే యిక్కడే పడుకోండి' అన్నది.

'ఈ మాట అనటమే తరువాయిగా అంగీకారాన్ని చూపాను.'

'ఏం...బాగా అందంగా వుంటుందా?' అన్నాడు పోలీసు ఇన్‌స్పెక్టరు ప్రక్కనే కూర్చున్న మిత్రుణ్ణి మోచేత్తో పొడుస్తూ.

'మీరు డ్రీమ్స్‌లోకిపోయి పడిపోతే, బ్యాగ్ తేలేదు మందు యివ్వటానికి' అన్నాడు డాక్టరు. హాలు

నవ్వుతో నిండింది.

'గో ఆన్ ప్లీజ్' అన్నాడు కాంతయ్య సీరియస్‌గా చూస్తో.

'సరే. నాకు ఒకగది చూపించింది. స్విచ్ ఆఫ్ చేసి పందిరి మంచంమీద పడుకున్నాను. ఒక అరగంట సేపు నేను ఏది ఆలోచిస్తున్నానో నాకే తెలియదు. మధ్య హాల్లోని చిన్న దీపపుకాంతి నా గదిలోకి పాకుతో వుంది. గడియారపు టిక్ టిక్ ధ్వని తప్ప గదంతా నిశ్శబ్దంగా వుంది. తుపాకి మోతకు పక్షులు చెల్లాచెద రైనట్టు నాలోని ఆలోచనల గుంపు చెల్లాచెదరైంది. ముందు లావెండరువాసన, పల్చని అడుగులధ్వని, క్రొత్త చీర మడతలు నలుగుతున్న సవ్వడి వినవచ్చాయి. లావెండరువాసన నా శరీరాన్ని గట్టిగా, బలంగా తన మెత్తటి ప్రదేశాల్లోకి లాక్కున్నది.

'పాపం! నన్ను గురించే ఆలోచిస్తున్నావుకదూ!'

'ఆఁ... అన్నట్లుగా తలూపాను. అలా గంట గడిచింది.' అన్నాడు డాక్టరు, సిగరెట్టుకోసం జేబు తడుముకుంటూ. ఇంతలో కాంతయ్య అందించాడు ఉత్సాహంగా.

'ఆగంట ఎలా గడిచిందీ?' అని ఇన్‌స్పెక్టరు నవ్వాడు.

'మామూలుగానే కొత్తేమీలేదు' అన్నాడు

డాక్టరు. క్లబ్ వాలాలందరూ గొల్లున నవ్వారు.

'డోన్టు డిస్టర్బ్. ఇక్కడే అసలు 'క్లూ' వుంది. బయట ఎవరో తలుపుకొట్టారు. నా గుండె ఆగినంత పనైంది. ఆమె చివాలున లేచి—

'వారు, మావారొచ్చారు. మెయిల్ వొచ్చిందల్లెవుంది. రేపు వొస్తానన్నవారు యివ్వాళే వొచ్చారు. యీ దోవనపొండి.' 'అని, దొడ్డిదోవన నన్ను పంపింది. బ్రతుకు జీవుడా అని యింటిదారి పట్టాను. తరువాత మూడు రోజులకు మళ్ళీ ఆమెను కలుసుకోవాలని టాయిలెట్ చేసుకొని ఆమె యింటికి చేరుకున్నాను. మీరు యిక్కడే బాగావినాలి. అదే యిల్లు. నాకు బాగా గుర్తు. మెట్లక్కాను. హాల్లో ఆమె డ్రాయరు దగ్గర కూర్చొని వదో వ్రాసుకుంటున్నది. ఆమె నాకు బాగా గుర్తు. హాల్లో ఫర్నీచర్ కూడా నాకు బాగాగుర్తు. నా అడుగులధ్వని విని—నావొంక, వ్రాస్తున్నది ఆపి చూచింది. నేను చిరునవ్వుతో 'నమస్కారంమేడమ్' అన్నాను—

'అలా — ఆ కుర్చీలో...'

'ఆ గొంతు, అదే, యిదివరకన్నమాట నాకు బాగాగుర్తే. నేనేం పొరపాటు పడలేదు. నాలోకి ఆమె చిత్రంగా చూస్తో—

'ఏం పనిమీదొచ్చారు' అని అన్నది. నేను

చిక్కులో పడ్డాను నేను డాక్టరు రమాకాంత్. మీరు లేడీస్ క్లబ్ సెక్రటరీ కాదండీ' అన్నాను అనుమానంతో.

'సారీ. పొరపాటుపడ్డారల్లేవుంది. నేను జనరల్ ఆసుపత్రిలో నర్సును' అన్నది.

'అయినా నా అనుమానం తీర్చుకోటానికి 'యీ వీధిలో యింకెవరైనా వున్నారా?' అన్నాను.

'లేదండీ. ఈ వీధిలో నాకు తెలిసినంతవరకు మీరు అడిగేవారు లేరు' అన్నది.

'అదేయిల్లు, అవే సోఫాలు, ఫ్లాస్కు అక్కడే వుంది. అదే హాల్లో నేను కాఫీ తాగాను. హాలుకు చివరగా నడిస్తే కుడిచేతివైపువున్న గదిలోనే నేను పడుకున్నాను. నన్ను ఆమె ఏమీ ఎరుగనట్లే చూస్తోవుంది. ఆ రాత్రి తనంత తానుకోరిన స్త్రీ యింత 'సింపతీ' లేకుండా మాట్లాడుతుందా? 'సరే వస్తాను'; అని లేచి వాకిట్లోకి నడిచాను.

'ఇదంతా ఆలోచిస్తే ఆ రాత్రి నన్ను కలుసుకుంది నిజంగా దయ్యమే. ఆమె రూపాన్ని ధరించి ఆ రకంగా నన్ను మోసం చేసింది. ఆ రాత్రి ఆయింటివారు లేకుండా వుండవొచ్చు. దయ్యాలకు ఏ రూపం కావాలంటే ఆ రూపం వొస్తుంది. దాని కదృశ్యమయ్యే కాలం సమీపించగానే అదే చప్పుడు చేసి నన్ను బయటికి పంపించింది. ఆనాటినుంచి ఆ సంగతి తలుచుకుంటే

నా గుండెలు కొట్టుకుంటాయి. అది దయ్యమంటారా? కాదంటారా?' అని డాక్టరు అందరివంకా చూస్తో ప్రశ్నించాడు.

'దయ్యమే. ముమ్మాటికీ దయ్యమే.' అని కాంతయ్యగా రన్నాడు స్పెన్సర్ చుట్టను పండ్లతో గట్టిగా పట్టుకుని.

క్లబ్ అంతా ఆశ్చర్యంగా చూస్తో, ప్రకాశరావు సమాధానంకోసం నిరీక్షిస్తున్నారు.

ప్రకాశరావు వంచిన తలెత్తి—

'మీకు బాగా గుర్తేనా ఆ తారీఖు' అన్నాడు.

'ఓ. కావలిస్తే నాడైరీ చూడండి.' అన్నాడు డాక్టరు— డైరీకోసం కోటుజేబులు తడుముకుంటూ.

'వొద్దులెండి. ఆమె...ఆకుపచ్చ సిల్కు-చీరె, గీరల ఎర్రటి జాకెట్టు,కట్టుకుందికదూ? గదిలో బ్లూలైటు, పడకమంచాని కెదురుగా రాధాకృష్ణులపటం వున్నాయి కదూ!' అన్నాడు ప్రకాశరావు డాక్టర్ని పరీక్షగాచూస్తో.

డాక్టరు ఏదో గారడీలో పడ్డ వాడిమాదిరిగా బిత్తరైపోయి—

'ఆఁ ఆఁ నిజం, నిజమే' అన్నాడు నత్తిగా. ప్రకాశరావు హాలు ప్రతిధ్వనించేలా నవ్వి—

'బ్రేవో, బ్రెవ్ డాక్టర్. అది నిజంగా దయ్యమే. కాంతయ్యగారూ, మిమ్మల్ని అనవసరంగా నొప్పించాను.

డాక్టరు చెప్పిన చోంట్లో ఆవగింజంత కూడా అబద్ధం లేదు. వస్తాను డాక్టరు రమాకాంత్. గుడ్ బై' అని లేవబోతున్న ప్రకాశరావు వ్రేలినవున్న నీలపురాయి వుంగరం లైటుకాంతికి డాక్టరు హృదయంలో భయంకరంగా మెరిసింది.

# 3

## పక్షికి చిక్కిన పంజరం

౧

దరిద్రం, కుష్ఠు, చాలాభయంకరమైనవ్యాధులు. ఈ రెండూ సోకినవారు అందరిచేతా దూరంగా తరుమబడతారు. ఒకవేళ కనికరించి ఎవరేనా యింత తిండి పారేసినా, దయతో పక్కకు రానీరు. ఈ వ్యాధిగ్రస్తులు కూడా తక్కిన వారికి జంకి, వారి అదుపాజ్ఞల్లో వారి కనుగుణ్యమైన రీతుల్లో జీవిస్తుంటారు. జీవించాలనే ఆశ బలీయమైందికాబట్టి పై వ్యాధిగ్రస్తులు యిద్దరూ తమ అభిమానాల్ని చంపుకుని బ్రతుకు తుంటారు.

కనకయ్య యిప్పటికీ లైబ్రరీ అరుగులమీాద కనిపిస్తూనే వుంటాడు. అతని ధోరణిని ఎవ్వరూ పట్టించు కోరు. ఒకరు తన మాటల్ని వినాలని అతనికీ లేదు. లైబ్రరీ గోడలు కనకయ్య వాగుడు వినీ వినీ విసుగెత్తి పెత్తికలూడి పోయాయి.

'ఓ దీనజనులారా! డాక్టర్నీ, ఆడదాన్నీ నమ్మకండి. ఒరే డాక్టర్! నా పెళ్ళానికి యింజెక్షన్ యివ్వ

టానికి ఆ గదిలో అంత సేపా! నీ బండారమంతా నాకు తెలుసు. నా పార్వతీ చాలా అమాయికురాలు. నీవు దానికేదో మందు పెట్టావు. తలుపు తీస్తావా, తీయ్యి. మర్యాదగా బయటికి రా! లేకుంటే తలుపు బద్దలు కొట్టి బయటికి లాగి తంతాను. మందుపెట్టి దాన్ని వశం చేసుకుంటావా? నాకు తెలుసు నీవేం మందు పెట్టిందీనూ. జిలేబికదూ... నాకు తెలుసు... ఆ వెంక ట్రామయ్యగాడితో కలిసి జిలేబిలో మందు జోడించి పెట్టావు. ఆ విషాన్ని ఒక్క మంత్రంతో విరిచేస్తాను.

'బాబూ! బాబూ!! మీకు పుణ్యముంటుంది. ఆ వెంకట్రామయ్యగాడి హోటల్‌కు వెళ్ళకండి. వట్టి నూనె సరుకు. అక్కడి జిలేబి తిన్నారా, మీ మనసులు మారి పోతాయి. నంజప్ప హోటల్ రైటు. డబ్బులు లేక పోయినా 'రేపు తెండి పంతులుగారూ. మీదగ్గరెక్కడికి పోతాయి' అంటాడు.

'పార్వతీ! తలుపు తియ్యి. శ్రీ శ్రీ శ్రీ రాజా బహద్దర్ కనకయ్యా దొరగా రొచ్చారు...వెరిగుడ్—అలా తయారు కావాలి! సినిమాకా? అరె! వాయిల్ కోక కట్టావా? నేను రాను. సిల్కు కోక కట్టుకుంటేనే, నీ వెంట సినిమాకు వస్తాను...చాకలి తేలేదా? ఒరే చాకలి! నీ డొక్క చీల్చి డోలు కడతా. నీకు రేపు డజన్ సిల్కు కోకలు తెస్తాను. ఈ రోజుకు మానుకో.'

అంటున్నాడు కనకయ్య గుంజ దరువేస్తో.

'దేవగాంధారి రాగమా? కాంభోజి పాడ మంటారా?' అని తన కెదురుగా వున్న పిల్లల్ని అడిగాడు. పిల్లలు కాకి గుంపులా ఒక్క-సారి గొల్లున లేచారు. కానీ అతని చెవులకు యితర శబ్దాలు వినపడి యిప్పటికి చాలా కాలమైంది.

'పొండిరా వెధవల్లారా! మీరు పాడమంటే నేను పాడటానికి, నేనేం పిచ్చాణ్ణనుకున్నారా? నా పార్వతి పాడమంటే పాడతా...ఏం పార్వతీ పాడ మంటావా?'

* * *

'పార్వతీ...' అన్నాడు కనకయ్య.

ఆమె పలుకలేదు. మంచాని కద్దరిగా తిరిగి పండు కుంది. టేబుల్ మీది కొడిగట్టిన దీపపుకాంతి, గదిలో నలుమూలలా పాకలేక అవస్థపడుతోంది. సగం మేరకు కాలి ఆరిపోయిన అగరొత్తి, స్టాండులో నుంచుని దిగాలుగా దిక్కులు చూస్తోంది. కనకయ్య పార్వతిని ఆపాదమస్తకం చూచాడు. ఓ సౌందర్య రాశి తన ప్రక్క-నే వున్నది. కొండనన్నా కదల్చ గలడేమో కానీ ఆమెను తనవైపుకు మరల్చుకోలేక పోతున్నాడు కనకయ్య.

అలా త్రిప్పుకోవాలంటే, బలమనేది కేవలం

నిష్ప్రయోజనం. చాకచక్యమూ, యోగ్యతా కూడా వుండాలి. కనకయ్యను లోకం వొట్టి దద్దమ్మన్నది; కానీ కనకయ్య లోకాన్ని ఏమీ అనలేదు.

రాజ్యాలు, అపార సంపదా సంపాదింపవొచ్చు. మంత్రులు, హంతకులు తేలిగ్గా కావొచ్చు, కానీ ఒక స్త్రీచేత ప్రేమింప బడటం, ఆమె హృదయంలో నిక్షిప్తమైన అవ్యాజాను రాగాన్ని, తాడో పేడో తేల్చుకోవటం మాత్రం సులభ సాధ్యం కాదు. నీతీ, పరలోక భయమూ, తరతరాలుగా వొస్తున్న నిబంధనలు, ఆర్థిక అసమానతలాంటి సవా లక్ష బురుజులే నిర్మించకపోతే, యీ పురుష సామ్రాజ్యం ఏనాడో జయింపబడి, యిప్పుడు వాటి తాలూకు శిథిలాలనే మనం చూచే వాళ్ళం.

'చూడూ! నేను నీవాణ్ని. అమ్మ లక్షఅంటుంది. అంత మాత్రంచేత నువ్వు కూడా యింత 'యిదిగా' అనటం మంచిది కాదు. ఇంకా కొంతకాల మాగు. అదేం శిలేసుక బ్రతకదు గదా! ఈ గుండె జబ్బుతో ఎప్పుడో ఒకప్పుడు ఠఫీమని చస్తుంది. తరువాత నీ యిష్టం...సరా...' అని కనకయ్య పార్వతి భుజం మీద గోముగా నిమిరాడు.

పార్వతి మంచానికి గోడకు మధ్యగా ఊసింది. కనకయ్య చెదిరిన ఆమె ముంగురుల్ని మొహంమీంచి

తీసి, జుత్తులో కలిసేటట్లుగా గోటితో సవరిస్తూఅన్నాడు-

'అయినా ఫరవా లేదు. నీకు తెలీని దేముంది? నాలో వున్న గురిగింజెత్తు అభిమానం కూడా నశించి చాలా కాలమైంది. దానికి నేనేం చింతించటం లేదు. ఆ స్వాభిమానమే ఉంటే, నే నింకా అనుక్కు తింటుండే వాడినే. నా యిద్దరు తమ్ముళ్లు యింకా నా కండ్లల్లో కనిపిస్తూనే వున్నారు. వాళ్ళు దరిద్రంతో కాగి ఎండి పోతున్నారు.'

'నువ్వు యిడ్లీపళ్ళాలు మోసిన వాడివనే సంగతి తెలీక, మా వాళ్ళు యీ గోతిలో పడ్డారు. నా గొంతు కోశారు. ఆమె నిన్ను దత్తు చేసుకోకపోయినా, నాకర్మ యిలా కాలేది కాదు. సుఖపడే జాతకం నా మొహాన లేనప్పుడు నిన్న నేం ప్రయోజనం?' అన్నది పార్వతి.

'నాకేం, ఆస్తి పరుణ్ణి. అనవసరంగా వాగ బోకు!' అని అందామనుకున్నాడు. అయినా తనపూర్వ స్థితి అదేగదా! రోషపడి ప్రయోజనంలేదు - అనుకుని తనను తాను సముదాయించు కున్నాడు కనకయ్య.

'ఇంతకీ అమ్మ...' అని చెప్పబోయే కనకయ్య మాటను మధ్యలోనే అడ్డుకుని, రోషంతో నిట్టూర్చి, తల కొంచెం పక్కగా తిప్పి, యింటి కప్పుకేసి చూసింది పార్వతి.

'అవును. అమ్మే...మీ ముద్దులమ్మే; నాగొంతు

కోసింది. మా వాళ్ళను దగాచేసింది. ఆ ప్లీడరు పెళ్ళాం చూడు, ముచ్చటేస్తుంది. నాజీవితానికి యింతముచ్చటా పాడూ నోచుకో లేదు. 'రాతకేడుద్దునా...కట్టుకున్న మొగుడు కేడుద్దునా...' అన్నదట వెనుకటి కొకామె. హాయిగా యింత చదువుకున్న వాడూ, ఉద్యోగస్థుడూ నా మొహానికి, లేనప్పుడు నిన్న నేం ప్రయోజనం, ఆమె నని ఏం ప్రయోజనం?' అని పార్వతి యథాప్రకారం అటు కేసి తిరిగి పడుకుంది.

'నిజమే! దానిదంతా చాదస్తం. దాని నోటికి నే భయపడుతున్నాను. అదీకాక బోలెడంత ఆస్తి ఆవిడకు వుంది. ఎలాచెప్పు? కాస్త ఓపికపడితే ఆ ప్లీడరూ, ఆయన భార్యలాగే మనమూ వుందాం... సరేనా...?' అతని మాటను ఆపుతూ, పార్వతి అన్నది చిరాకు స్వరంతో —

'సరే. చాలా సంతోషం, కడుపునిండింది పడుకో. పాపం పొద్దుపోయింది. పగలల్లా ఉద్యోగం చేసీ చేసీ రెక్కలు ముక్కలు చేసుకొచ్చావు. అలసి పొయ్యావు. విసరనా? కాళ్ళొత్తనా? ఇంకేం కావాలి...?' అన్నది.

'ఇక్కడే పడుకోనా?' అన్నాడు కనకయ్య భీతిగా.

ఆమె మాట్లాడ లేదు. కనకయ్య భార్యకు కొంచెం దగ్గరగా జరిగాడు. ఆమె శరీరం తన శరీరానికి

అక్కడక్కడా తగులుతూ వుంది. ఆ స్పర్శానందానికి అతని కళ్ళు బైర్లు కమ్మాయ్. ఏవో అనూహ్యమైన స్మృతి పథాల్లోకి లాక్కెడుతోంది—పార్వతి సౌందర్య సాగరంలో కనకయ్య యింకా వొడ్డునే తన్ను కొంటున్నాడు.

౨

కనకయ్యనూ, అతని ఆంతరంగిక విషయాల్లోని మెతకనూ, మనం అవహేళన చేయొచ్చు. కానీ అతని పరిస్థితులను పరిసరాల్నీ మనం నిష్పాక్షిక దృష్టితో ఆలోచించితే అర్థమౌతుంది...మాట అనడం సులువు. తేలిక! ఈ లోకానికి ఆలోచించేందుకు తీరికుండదు. 'వొట్టి దద్దమ్మ. ఆడదానికి దాసోహమంటాడు' అని యితరులు అనేమాట కొట్టెయ్య తగ్గది కాదుకానీ, అతన్నా స్థితికి తెచ్చిన బలీయమైన వత్తిడిని మాత్రం ఎవ్వరూ ఆలోచించరు.

రాఘవమ్మకు కనకయ్య దత్తు పుత్రుడు. పార్వతికి పదిమందీ నిర్ణయించిన భర్త. ఇవే అతనికున్న డిగ్రీలు. కుటుంబం నానాఅవస్థలు పడుతూ, యిడ్లీపళ్లెం తీసుకుని, నాల్గు వీధులు తిరిగే కనకయ్యను, ఏదో దూరపు బంధుప్రీతివల్లగానీ, మరెక్కడా దొరక్కగానీ, యీామె అతన్ని దత్తత చేసుకుంది. ఆ నాటినుంచి

కనకయ్యకు యింత తిండీ, గుడ్డా దొరికాయి. బహు కాలం చదువుకునే శక్తిలేక, ఉదరపోషణార్థం ఏదో చెయ్యాలి కనుక— అతని చదువుసంధ్యలు ఆటే సాగ లేదు. కనకయ్య దత్తుపోయేకాలానికే అతనికావయస్సు కూడా దాటిపోయింది.

కనకయ్య కంటే— చిన్న వాడిమీదే రాఘ వమ్మకు మనసున్నది. రెండోవాణ్ణైనా యింతచదివించ వొచ్చుననే ఆశవున్నా, ఆమె దూరంగా చాలావిధాలుగా ఆలోచించింది. వాడా చిన్న బుడుతడు. ఎన్నాళ్ళకి ఎక్కొస్తాడు? తనకా గుండెజబ్బు. ఎప్పుడో బుడింగు మనొచ్చు. ఈ ఆస్తిని ఆజమాయిషీ చేసుకోలేకపోతే లోకులు తన్నుకు పోతారు. చదువులేకపోయినా యింత వయస్సున్నవాడు. సంసారాన్ని దిద్దుకుని, తనకు చేదోడు వాదోడుగా వుంటాడని ఆలోచించి కనకయ్యనే దత్తు చేసుకున్నది రాఘువమ్మ.

వేళకు తిండి, మంచిగుడ్డలు, శ్రమలేని జీవితం కావటంతో, కనకయ్య కాస్త నునుపారి, కంటికియింపుగా తయారయ్యాడు. గర్భదరిద్రుడైన తనకు, యింతఆసరా, ఆశ్రయమూ యిచ్చినందుకు, కనకయ్య తల్లిమాట జవదాటే వాడుకాడు. దానితో అతనిలోని అన్నిశక్తులు చప్పగా చల్లారి పోయాయి. సన్నగా ఊచకుమల్లే పెరిగి, ఎప్పుడూ ఏదోఆలోచనతో దిగులుగావుండేవాడు.

ఇడ్లీపళ్లెం తన నెత్తిమీంచి దిగిందే కానీ, అతని కాసంతోషమే లేదు. తను యింత తింటున్నాడు. కానీ కన్నవారు మలమలా మాడిపోతున్నారు. వారి పోషణా భారం అధికంగావటంవల్ల; ఒకడు తగ్గటంవల్ల తమ భారం తగ్గుతుంది, వాడూ ఇంత సుఖపడుతాడు అనే ఆలోచనతో కడుపు వొదులుకుని, అక్కర కొచ్చిన తన్ను దత్తు యిచ్చారు. నిజంగా తను కృతజ్ఞత—రాఘవమ్మ క్కాదు, తన తలిదండ్రులకే చూపాలి. కానీ ఏం లాభం? ఈ ఆస్థిలో ఒక్క చిల్లిగవ్వకూడా తన వారి కివ్వటానికి రాఘవమ్మ వొప్పుకోదు.

వెయ్యిన్నూటపదహార్లు, వెండిచెంబూ, వెండి కంచమూ, మొదలగు తగులాంఛనాలతో, వో చక్కని పిల్లను కోడలిగా తెచ్చుకున్నది రాఘవమ్మ. 'బోలె డాస్థి, చదువు చట్టుబండలు లేకపోయినా కట్టుకుపోయి నంత వుంది. వేణు చదువుకొని ఏం చేస్తున్నాడు? అంతే యీ చదువుకున్న వాళ్ళంతాను. నాల్గురాళ్ళు వుంటేనే ప్రయోజకుడు. ఎంతచదివినా ఐదు వేళ్ళు లోనికి పోకపోతే అమ్మాయి వాడి చదువు భోంచేసి బ్రతుకుతుందా?' అని పార్వతి తల్లి పోరుకాడి ఈ సంబంధానికిచ్చి పెళ్ళిచేసింది.

పార్వతి అందానికి కనకయ్య కళ్ళు జిగేలు మన్నాయి. తన దశ తిరుగబట్టే రాఘవమ్మ దత్తు చేసు

కున్నది. ఆ యిడ్లీపళ్ళేమే తన నెత్తినుంటే, యీ అందాల
రాశి తనకు లభ్యమయ్యేదా! అసలు అందాలరాశి
సంగతి దేవు డెరుగు. పెళ్ళయ్యేదా!...ఇకముందు తన
జీవితంలో కలుగబోయే సంఘటనలు నెమరేస్తో ఉబ్బి
పోయాడు.

కనకయ్యను పకడ్ బందీగా ఎలాపట్టుకొచ్చిందో,
కోడల్ను కూడా అలాగే పట్టుకురావాలనే రాఘవమ్మ
ఆలోచన మొదట కొంచెం సాగినా, పార్వతి క్రమేణా
వ్యతిరేకించటం మొదలు పెట్టింది. కనకయ్యమీద
చలాయించటానికి ఆమెకు తగిన అవకాశం వున్నది.
పార్వతిమీద కూడా అదేవిధంగా సాగటానికి బలంలేక
పోయింది. ఇంతవున్న కుటుంబంలోనుంచి, సౌఖ్యపడి,
దర్జా లనుభవించి వచ్చిన పార్వతి, రాఘవమ్మ
మాటను ఖాతరు చెయ్యలేదు. ఇంత దరిద్రంలోనుంచి
వొచ్చిన కనకయ్య, పార్వతితో సమానంగా పోల్చు
కుంది రాఘవమ్మ. తన అదుపాజ్ఞల్లో లేని కోడల్ని
సహించ లేక పోయింది. దానితో చిలికిన చిన్నచిన్న
తగాదాలు గాలివానగా మారాయి.

పండక్కి పుట్టింటికెళ్ళిన పార్వతి, ఎన్ని వుత్త
రాలు వ్రాసినా సమాధానం యివ్వలేదు. రాఘవ
మ్మలో కొంచెం గాభరా పుట్టింది. కనకయ్యను పంపినా
పోస్టులో కార్డుపోయినా ఒకటేననే ఉద్దేశ్యంతో, తనే

బయలుదేరి వెళ్ళింది. పార్వతి తలిదండ్రులు నానా మాటలన్నారు. తనో చవటను దత్తు చేసుకోబట్టే కదా తనిన్ని మాటలు పడాల్సి వొచ్చిందని కిమ్మనకుండా వూరుకుండామె. పార్వతి ససేమిా 'రా'నన్నది. నానా అవస్థలూపడి, నలుగురిచేతా చెప్పించి, తనవెంట తీసుకొచ్చింది పార్వతిని. దీనితో పార్వతిలో పూర్వం ఏ కోశానన్నా యింత భయముంటే, అదికాస్తా పోయింది. తను పార్వతిమీాద నోరు చేసుకుంటే, ఈదఫా అంతు లేకుండా పోతుందనే భయంచేత, రాఘవమ్మ చప్పగా చల్లారిపోయి, ఆ కోపం కూడా కొడుకుమీాదే చూపటం సాగించింది. అయినా చెదురుగా వారిద్దరూ తగాదా పడుతూనే వున్నారు. కీచులాడుతూనే ఉన్నారు.

అటు పార్వతీ, యిటు రాఘవమ్మా, వారివారి స్థానాలకోసం రెండు వైపులనుంచీ కనకయ్యను కుమ్ముతున్నారు. ఈ రెండు పొట్టేళ్ళ మధ్యా కనకయ్య నలిగిపోతున్నాడు. ఎడతెగని సంఘర్షణలతో యిల్లు రద్దీకాజొచ్చింది. కనకయ్య ఒక ఆలోచనచేశాడు. భార్యను వెనకేసుకొని తల్లిని గదమాయించాడు; రాఘవమ్మ భయపడుతుందనే సదుద్దేశ్యంతో. పార్వతి అందం కనకయ్యలోని వాత్సల్యాన్ని 'ఇన్‌ఫ్లూయన్స్' చేసింది. దాంతో రాఘవమ్మ తోక తొక్కిన తాచులా లేచింది!

'ఇడ్లీ వల్లెం నెత్తి నెట్టుకు తిరిగే గీత తప్పించి

నందుకా యీ మహోపకారం! నీరాత రాళ్ళపాలయ్యేదే నేను తీసుకు రాకపోతే. నీకూ కళ్ళున్నాయిగా, నీతమ్ముళ్ళ గతిచూడు. నీ జాతక చక్రం తిరగబట్టే గారెల బుట్టలో పడ్డావు. ఆడదాని మాటెని నామీది కొస్తావా? నువ్వు చవటవని తెలిసే నిన్ను బొమ్మనుచేసి ఆ భడవా ఆడి స్తున్నది. ఛీ! లోకుల సొమ్ముతిని గడకుమల్లే పెరిగావు. అంతమాత్రం తెలీదూ ఆడదాన్ని అదుపులో పెట్టు కోవటం?' అని రాల్చిపోసింది రాఘవమ్మ.

ఈసంగతీ నిజమే! ఆమె తన గతజీవిత నైచ్యాన్ని ఆధారంగా తీసుకుని, తనను చావుదెబ్బ కొట్టేది. ఆ దెబ్బకు కనకయ్య లోనిపులి గాండ్రించి పరుగు లంకించు కున్నది. అలా పరుగెత్తుతూ విసివి పొదలో దాక్కున్న పార్వతి మీదికి దూకబోయింది.

'నీ లాంటి చదువు సంధ్యలు లేనివాణ్ణి చేసుకో బట్టే నారాత యిట్లా రాసింది. ఆ ప్లీడరు, ఆయన పెళ్ళాం చూడు, ఎంత ముచ్చటగా వుంటారో, నా వాళ్ళు నా గొంతు కోశారు. ఆలనా, పాలనా, ముద్దా, ముచ్చటా ఏముంది? నీ లాంటి అప్రయోజకుడు దొరి కాడు నా ఖర్మకొద్దీని' అనేది పార్వతి.

ఇదీ మరోవైపునుంచి కనిపిస్తున్న సత్యాం. దీన్ని చూచి కనకయ్యలో అదివరకే గాఢరాతిన్న పులి, తన కెదురుగా వున్నది 'గిలి' అనుకుని కనుచూపు మేర

కూడా కనిపించకుండా గుట్టలు పట్టిపోయింది. దాంతో కనకయ్య లోని గొత్తె దిటవుగా కోటలు నిర్మించుకుని రాజ్యం చేస్తోంది.

ఈ రకమైన వ్యధలు, బాధలు అతనిలో పెరిగే మాంసాన్ని తినసాగాయి. ఆ కారణంగా కనకయ్య ఎదుగూ బొదుగూలేక కట్టెపేడులా తయారయ్యాడు. ఆస్తీ, అందమైన పెళ్ళాం, యీ రెండూ అందకుండా అతని నోరు వూరిస్తున్నాయి. వీటిని అందుకునే ప్రయత్నం లోనే రోజులూ, వారాలూ, నెలలూ పరిగెత్తి పోతు న్నాయి. ఉన్నకొందికీ ఆ రెండు మరీ పైకి పోతున్నాయి గానీ, అతని కందేలా లేవు.

3

పార్కు బెంచీమీద పడుకుని ఎంతో సేపు ఆలోచించాడు కనకయ్య. తన గత జీవితంలోని దుర్బ లత్వాన్ని ఆధారంగా తీసుకుని తల్లీ, భార్యా, యిద్దరూ తన్ను నొక్కారు. రాఘవమ్మ కొడుకు గుట్టు భార్య ముందు బయట పెట్టటంతో, అతనిలోని 'ఇన్ఫీరియారిటీ' బైటపడ్డది. భార్య దగ్గర స్థానాన్ని సంపాదించ లేక పోయినాడు. ఎంత ఆలోచించినా అతని నోటి చేదు విరగటం లేదు.

వెల్లకీలా పడుకున్న కనకయ్య వో త్తిగిలి, చుట్టూ చూచాడు. తన చుట్టూ వున్నవన్నీ ఆనందంగా వున్నాయి. రంగు రంగు కోకలతో స్త్రీలు తగిన ఫాయూలో పురుషులు, ఎంతో కులాసాగా, ఆరోగ్యంగా ఆనందంగా కనపడుతున్నారు. తనకు కనిపించే ఏవొక్క ప్రాణిలోనూ రవ్వంత విచారం కూడా ఉన్నట్టు లేదు. భార్యాభర్తలు కలిసి తిరుగుతున్నారు. తనకు కొంచెం దూరంలో కూర్చున్న ఓజంట అతన్ని మరీ ఆకర్షించింది. ఆమె ఎందుకో నవ్వి, చేత్తో అతని తొడమీద కొట్టింది. 'ఎంత హాయి!' అనుకొన్నాడు కనకయ్య. వారి మొహాల్లో అతనికి చీకూ చింతా కనిపించటం లేదు. రేడియోలో నుంచి ప్రవహిస్తున్న దక్షిణాది సంగీతం కానీ, పార్కు ప్రక్కగా పరుగెత్తుతున్న కార్ల ధ్వనులు గానీ, అతన్నా ధ్యాసనుంచి మరల్చ లేకపోయాయి. 'ఎందుకు తనచుట్టూ గల ప్రపంచం అంత ఆనందంగా వుంది?' దానికి కారణం? తన కా యోగ్యత లేకపోవ టానికి .. కనిపిస్తూనే వున్నాయి భూతాలకుమల్లే.

ప్రధాన కారకురాలు తల్లి. పార్వతికీ తనకూ మధ్య దుర్భేద్యమైన కోట కట్టింది. తనకు సుఖం, సంతోషం లేకుండా చేసింది. ఈ కోట పడగొట్టాలి! ఎలా? ఈ మాయదారి గుండెజబ్బు దాన్ని తీసుకెన్నా పోదు. పీడ విరగడై పోతుంది. ఆ జబ్బుకూ సిగ్గులేదు.

అంతకన్నా ఆ ముసిలి దానికి విసుగు లేదు — అను
కున్నాడు కనకయ్య.

కనకయ్య ప్రక్కకు వొత్తిగిలే సరికి, ప్రక్క జేబు
లోని మందు సీసా డొక్కలో వొత్తుకుంది. తను
బయలు దేరిన కారణం యిప్పటికి గుర్తి కొచ్చిందతనికి.
గత వారంరోజులుగా రాఘవమ్మ రోగంతో అవస్త
పడుతూవుంది. లేవబోయాడు — మళ్ళీ —

'చావనీ. మందు లేక చావనీ. దీని నోట్లో
గుక్కెడు మందుకూడా పోయకూడదు. అయినా చావదు
కదా, ముండఘటం; ఏమైనా సరే మందు పోయ
కూడదు.' అనుకున్నాడు కనకయ్య.

హఠాత్తుగా కనకయ్య కళ్ళల్లో వో మెఱుపు
మెరిసింది. మనిషికి ముచ్చెమటలు పోసాయి. మొహం
నల్ల కప్పేసినట్లయింది. ఎందుకో గజగజా వొణికాడు.
గుండెల్లో బండలు పగలేస్తున్నట్లు శబ్దమౌతున్నది.
రోమాలు నిక్కబొడిచాయి. శరీరంలో పులకరం
బయలు దేరింది.

అరగంటకు కాని కనకయ్య మామూలు స్థితికి
రాలేకపోయాడు. బెంచిమీంచి లేచి, చొక్కా దులుపు
కొని బయలు దేరాడు. నడుస్తున్నాడే కాని అతని శరీరం
తేలిపోతున్నది. ఎట్లా నడుస్తున్నాడో! పైత్యరోగికి
మల్లే కళ్ళు బైర్లుకమ్మి, నాలుక తడారి పోతున్నది.

తనకు యిరుప్రక్కలా పరుగెత్తే వాటిని ఎలా తప్పుకుని పోతున్నాడో అతనికే తెలీదు.

రాత్రి పన్నెండు గంటలతరువాత యింటికొచ్చి, తల్లి మంచం దగ్గరగా కూర్చున్నాడు. ఆమె ఆయాసంగా బాధగా మూలుగుతున్నది.

'మందు తెచ్చావుట్రా కనకాయ్! ఓరి నీనోట గడ్డకొట్ట యింతసేపు ఎక్కడ చచ్చావురా?' అన్నది రాఘవమ్మ భరించరానిబాధతో.

'డాక్టరు...డాక్టరు. సరే, ఏదో వూరుపోయి, యిప్పుడే మందు యిచ్చాడు. మరి నేనేం చేసేది?' అన్నాడు నత్తిగా కనకయ్య.

'బాగా... ఆఁ... ఆయాసంగా వుందని చెప్ప లేదూ?' అన్నది రాఘవమ్మ రొప్పుతూ.

'చెప్పాను.'

'మరి యింటికి తీసుకు రాలేదేం?' అన్నది రొప్పు అధికంగా వుంటం మూలాన చిరాకుగా. కనకయ్యకు కంగారు పుడుతోంది.

'రేపొస్తా నన్నాడు!' అన్నాడు కనకయ్య.

'ఏదీ...ఆ మందు కాస్త గొంతులో పొయ్యి. నేను కూర్చోలేను' అన్నది రాఘవమ్మ ఎండిపోయిన పెదాలను నాలుకతో తడిచేసుకుంటూ.

'మందివ్వలా. ఏదో మాత్ర యిచ్చాడు. దీంతో

తగ్గిపోతుం దన్నాడు' అని జేబులోనుంచి పొట్లాం తీశాడు.

'వెయ్యి. గొంతులో వెయ్యి. నా తలరాత. ఇంతావుండి చేసేదిక్కు లేదు. రాణీగారు సినిమాకు పొయ్యారు— ఇంతకీ దాన్నినేం ప్రయోజనం?... చూడు కనకం! నేను బ్రతుకుతానో, లేనో, చెప్ప లేను, ఆడదాన్ని ఎప్పుడూ నమ్మకు. ఇప్పటికే నిన్నది లోకువ కట్టింది. ఇక ముందన్నా జాగ్రత్తపడు.'

కనకయ్యకు ఆమె ఏం చెప్తున్నదో వినిపించటం లేదు. చెవుల్లో ఏదో పెద్ద హోరుగాలి లాంటిది బయలు దేరింది. ఆమె గొంతులో మాత్రవేసి యిన్ని నీళ్ళు పట్టి... తన గదివైపుకు నడిచాడు. గాలి పటంలా వూగుతో నడుస్తున్నాడు. 'సినిమాకు పోయింది!' అను కున్నాడు. మంచంమీద పడుకున్నాడే కానీ, అతనికి ఏదో భయంకర రూపం కనిపిస్తున్నది. దాని బ్రహ్మాండ మైన పిడికలిలో తను గిలగిలా తన్నుకుంటున్నాడు. కాళ్ళు, చేతులు వూచిక పుల్లల్లా వూగిపోతున్నాయి. కళ్ళు మూసుకున్నా తెరుచుకున్నా అదే రూపం... మెదడు దీపాల దిన్నెలా మండి పోతున్నది. అతను చూస్తున్నాడు. అతని చెవులకు ఏదో భయంకరమైన గావుకేక వినిపిస్తోంది. ఏం చెయ్యాలి? పక్కమీద అటూ యిటూ దొర్లుతున్నాడు కనకయ్య!

పార్వతి సరాసరి గదిలో కొచ్చింది. ఆమె

వాలకంచూచి అదిరిపోయాడు కనకయ్య. 'సినిమాకు వెళ్ళిన దానివి యిప్పుడా వొచ్చేది? సినిమానించి ఎక్కడికి వెళ్ళావు?' అని అడుగుదా మనుకున్నాడు. మాటలు గొంతులోనే వుండి పోయాయి.

'ఏం! అలా పడుకున్నావ్? మీ తల్లిగారు నోరు తెరిచి, గుడ్లు తేలవేసింది. నాకే అదురు పుట్టింది. పోయి ఆచారిగార్ని పిలుచుకురా' అన్నది పార్వతి.

కనకయ్య మంచం మీంచి లేవబోయి, రెండు తడవలు పట్టుతప్పాడు. పడుతూ లేస్తూ పోయి, ఆచారి గార్ని తీసుకొచ్చాడు. ఆయనగారు నాడిచూచి—

'బయటికి పట్టుకెళ్ళండి.' అన్నాడు.

కనకయ్య గొల్లుమన్నాడు. పార్వతి మొహానికి గుడ్డ అడ్డం పెట్టుకుంది. బయటిగోడకు పక్కగా పడుకో బెట్టి, కాళ్ల దగ్గరగా కనకయ్య, గుమ్మాని కవతలగా, తలుపు దగ్గర పార్వతి కూర్చొని వున్నారు. బుట్టక్రింది దీపపుకాంతి చారచారలుగా కనిపిస్తోంది.

చుట్టూ చేరిన నలుగురూ ఏమనిపోతారోనని, పార్వతి విచారంలో మునిగి పోయినట్లు నటిస్తోంది. కనకయ్యలో విచారంకంటే భయమే అధికంగా వుంటం వల్ల, అతనో మాదిరిగా కనిపిస్తున్నాడు. రాఘవమ్మను ఎరిగినవాళ్ళు, ఆమె గత చరిత్రలో తెలిసిన మంచినే ఏకరువు పెట్టుతున్నారు. మధ్యాహ్నానికల్లా తనవా

రొచ్చారు. పార్వతివైపు వారు రావటానికి అసలు ఈ వార్త అందటమే ఆలస్యంగదా! 'పట్టండి. ఇంకా ఎంతసేపు ఏడ్చినా తిరిగిరాదు కదా! కాకపోతే, ఇవ్వాళ, రేపు, అంతే తేడా!' అని హితవాక్యాలు చెప్పి నలుగురూ నాలుగు చేతులేసి శవాన్ని లేపారు... కాలవలో స్నానంచేసి, గుడిలో దీపారాధన చూచి నలుగురితోపాటే యింటికొచ్చాడు కనకయ్య.

నాల్గోనాడు పార్వతి తలిదండ్రులుకూడా చేరారు. రాఘవమ్మ చావు యీ నాల్గు రోజుల్లోనే పాతపడి పోయింది. పార్వతి తన తలిదండ్రులను చూట్టంలోనే నిమగ్నురాలయి హుషారుగా వుంది. తనవార్ని నిర్లక్ష్యంగా చూట్టం కనకయ్యకు బాధగా వుంది. కాని ఏమి అనటానికీ గుండెలేదు. పూర్వమే బలహీనుడు. కాగా తన కిప్పుడు కొత్తగా వొచ్చిన బలమంటూ ఏదీ లేదు. తగదా పడినా తనవారి ముందు కూడా యింకా తలొంచుకోవాలి.

పార్వతి తండ్రి దొడ్లో స్నానంచేస్తూ, నీళ్లకాగు క్రింద మంటసరిచేస్తున్న కూతుర్ని పిలిచి—

'పిచ్చిదానా! పట్టుదల వుండాల్సిందే. కాని దానికీ సమయా సమయా లున్నాయి. ఇంకా నువ్వు యిలా పెంకెగా వున్నావంటే నీ చేతి కేమీ చిక్కదు. వాడికా యిద్దరు తమ్ముళ్ళు, కుటుంబం వుంది. వాళ్ళ

గోతి దగ్గర నక్కలకు మల్లే కాచుకు కూర్చున్నారు—'
అన్నాడు.

పార్వతికి అర్థంకాక అదోమాదిరిగా తండ్రిని చూస్తూ నుంచుంది.

'ఏమిటే అలా వెర్రి మొహ మేసుక చూస్తావు? ఇప్పుడు ఆస్తి వాడి చేతుల్లో వుంది. అది కాస్తా తమ్ముళ్లకు రాసిచ్చాడా సరి...యిక నువ్వు అనుభవిస్తావు' అన్నాడు తండ్రి.

పార్వతికి భయమేసింది. కనకయ్య ఆమె కళ్ళకు ఎంచేతో అజేయుడుగా కనిపించాడు.

'ఎట్లా నాన్నా?' అన్నది భీతిగా పార్వతి!

'ఎట్లా అని అడుగుతావేమే పిచ్చిబొంద! చిన్నగా వాణ్ణి లాలనచేసి ఆకాస్తా రాయించుకో.' అని అతనంటూండగానే అటుకేసి ఎవరో వస్తున్న అలికిడైంది.

'ఈ నీళ్ళకాగు అటుపెట్టు' అని భుజాన తుండు గుడ్డేసుకుని, ఎదురుగా వస్తున్న అల్లుడితో అన్నాడు—

'నీ కోసమే యింత సేపూ వున్నాం. రెండు చెంబులు పోసుకో. భోజనం చేదాం...అరే! యింకా పిల్లాడిలా అలా బిక్క మొహ మేసుకుంటారా! ఛీ. ఊరుకో. నేను లేనూ—' అని పార్వతికేసి తిరిగి—

'అబ్బాయికి నీళ్ళు తోడవే! యిద్దరూ ఎంతో

చిక్కిపోయారు...పోయి నీళ్లు పోసుకో నాయనా'
అంటూ ముందుకు నడిచాడు పార్వతి తండ్రి!

పార్వతి వసారాలో పడుకున్నదే కాని, ఎంతకీ నిద్ర రావటంలేదు. తన తండ్రి చెప్పిన మాటే యదార్థం. తన మాతి బిగింపు యిక పనికిరాదు. యిష్టమున్నా లేకపోయినా కళ్లు మూసుకోవాలి. ఆమె మంచం మీంచి లేచి, కొంచెం దూరంలో నిద్రపోతున్న కన కయ్య దగ్గరకు పోయి, మెల్లగా అతన్ని కుదుపుతూ లేపింది. కనకయ్య కళ్లు తెరిచాడు. ఎదురుగా పార్వతి వున్నది. అతను నమ్మలేకపోయాడు. చుట్టూచూచాడు. ఆవు పడుకొని నెమరేస్తూ వుంది. దాని కళ్లు నీలాల్లా మెరుస్తున్నాయి.

'ఎందుకు?' అన్నాడు కనకయ్య.

'పోయి గదిలో పడుకో...' అన్నది పార్వతి.

'ఎందుకు?' మళ్లీ అడిగాడు కనకయ్య; తనకా సంఘటన క్రొత్త కాబట్టి అర్థంకాక.

పోయి పడుకో చెప్తాను.' అన్నది, చెయ్యిపట్టుకు లేపుతూ. అయోమయంగా దిక్కులుచూస్తూ వెళ్ళి పడుకున్నాడు. తన నిక్కడ ఎందుకు గదిలో పడుకో బెట్టినట్లు? పడుకో బెట్టిందే హో...ఆమె రాలేదేం? తలుపు తీసుకుని ఎటన్నాపోతుందా?...యిలా తర్క వితర్కాలతో వుండగా, పౌడరు వాసనతో పాటే పార్వతి

గదిలో కొచ్చింది. 'కలా ?'—పట్టుకోక జరీ కుచ్చెళ్ళు పల్చటి శబ్దాన్ని చేస్తున్నాయి. ఆ సౌందర్య రాశి తన ప్రక్కగా వాలిపోయింది...

కనకయ్య ఈ హఠాత్సం ఘటనను ఊహించ నందున, అతని కేమిచెయ్యాలో కూడా అర్థంకాక గిజగిజ లాడి పోయాడు.

౪

కనకయ్యను బాగా దగ్గరగా లాక్కుని అతని చెంపమీద నిమురుతో- 'మూడు రోజులనుంచీ చూస్తు న్నాను. అక్కడే పడుకుంటావేం?' అన్నది పార్వతి జుత్తులోకి వేళ్లు పోనిచ్చి క్రాపు సరిచేస్తూ.

'నిజంగానా ?' నమ్మలేకపోయినాడు కనకయ్య.

'నిజంగా. వొట్టు. రోజూ పిలుద్దామనుకుని లేచే సమయానికి ఎవరో ఒకరు మేలుకునే వుంటున్నారు. యివ్వాళ ఎంతో ప్రయత్నంమీద లేవగల్గాను.' అని నోటికి టేబిల్ మీద జిలేబీ తీసి అందించింది. జిలేబీకన్నా తియ్యగా వుంది పార్వతి స్పర్శ. తను కలలోకూడా అనుకోలేదు. ముసిలిముండ ఉన్నంతకాలమూ తనకీ యోగ్యత కలుగనిచ్చిందా ! కాలం ఎంత వృథా అయి పోయింది ! పీడా వొదిలిపోయింది. ఇక తను సుఖ పడొచ్చు. పార్వతికి మంచి మంచి కోకలు తేవాలి.

ఆ ప్లీడరు...వాడి పెళ్లాం...అంతకన్నా బాగా చిలకా, గోరువంకలకు మల్లే వుండా లనుకున్నాడు కనకయ్య.

తన వొక్కడి కోసమే, పగతో, త్వరగా తెల్ల వారిందా అనిపించింది కనకయ్యకు.

'మరో రెండు రోజుల్లో మా వూరు పోదాం. నీకు గుడ్డలు పెట్టాలిట. మీ వాళ్ళను అటు పంపు' అన్నది పార్వతి.

'సరే' అన్నాడు కనకయ్య.

ఆ తెల్లవారి కనకయ్య తండ్రి, కొడుకును ప్రక్కకు పిలిచి—

'ఇదుగో? నువ్వు ఎంత దత్తుపోయినా మా గర్భ వాసాన జన్మించిన వాడివే. పెట్టుపోతలు కల్లైనా పుట్టు పోతలు మాత్రం కల్లకావు గదా. నా మాట విను. భగవంతుని దయవల్ల నీకు బోలెడాస్థి నచ్చింది. నీతమ్ము ళ్ళకు యింకా పెళ్లీపేరంటాలు గావాలి...' తండ్రి మాటను పూర్తికానివ్వకుండానే—

'ఆఁ, అయితే...?' అన్నాడు కనకయ్య.

'ఆఁ, ఏమీలేదు. వాళ్లిద్దరికీ చెరో ఎకరం వ్రాస్తివా, యింత కుటుంబీకులై నీ పేరు చెప్పుకుని దీపం పెట్టుకుంటారు. లేకుంటే వాళ్లు ఆ జన్మబ్రహ్మచారులు గానే వుండాల్సివొస్తుంది. నీ రక్తం పంచుకపుట్టారుగదా! నేనే సంపాదిస్తే ఆ ఆస్థికి వాళ్లు అర్హులు కారా?'

అన్నాడు తండ్రి కనకయ్యలోకి దీనంగా చూస్తో.

కనకయ్య ఆలోచించాడు. తండ్రిమాటలు చాలా యదార్థంగా కనిపిస్తున్నాయి. తనకున్న దాంట్లో చెరో ఎకరం రాస్తే, వాళ్ళు యింతసుఖపడతారు. తనకూ తరిగి పోయే దేమీ లేదు...

ఇలా అని అనుకున్న కనకయ్య, తన తండ్రి ముఖంలోకి చూచాడు. దౌడలు జారిపోయినాయి. జుత్తుపండి సంస్కారంలేక రాగివర్ణంగా మెరుస్తూంది.

'యిద్దరూ బాగా పెద్దాళ్లైనారు. నాల్గు బస్తాలు యింటికొచ్చే యేర్పాటుంటే వారి శేషజీవితం సుఖంగా వెళ్ళమారిపోతుంది. రాసిచ్చినా నన్ను అడ్డేవారు లేరు' అనుకున్నాడు కనకయ్య.

తండ్రి మోకాలిమీద తలపెట్టుకుని, నేలమీద ఏదో వ్రాస్తూ ఆలోచిస్తున్నాడు. ఏదో అలికిడి కావటం మూలాన కనకయ్య అటుకేసి చూచాడు. గది కిటికీ లోంచి పార్వతి కనిపిస్తూంది. లోపలకు రమ్మని చేత్తో సైగ చేస్తున్నది. 'వొస్తున్నా' అన్నట్లు మొహంపెట్టి చూచాడు కనకయ్య. ఆమె బుడ్డమూతిపెట్టి కొడతా నన్నట్లుగా వేలు వూపుతోంది.

'సరే' అని లేచి కనకయ్య పార్వతి గదిలోకి పోయాడు. పార్వతి అతన్ని దగ్గరగా లాక్కుని జుత్తు నిమురుతో...

'ఏమిటి అంటున్నాడు మీ నాన్న ?' అన్నది.

కనకయ్య జరిగినదంతా రెండు ముక్కల్లో చెప్పాడు. పార్వతిగుండె గతుక్కు మన్నది. కనకయ్యను యిక్కడుంచితే తన తండ్రి అన్నదంతా జరిగితీరుతుంది. ఇవ్వాళ ఒక యకరం, రేపు రెండు... అలా అంతా కర్పూరంలా హరించి పోతుంది. వెంటనే తన వూరికి తీసుక వెళ్ళాలి— అని పార్వతి అనుకున్నది.

'రేపు మా నాన్న అమ్మా వెళ్తారట, మరి మనం వారితోపాటే పోతేమంచిది.' అన్నది పార్వతి, కనకయ్య చొక్కాకంటిన గోడ మట్టిని దులుపుతూ.

'పోదాం' అన్నాడు కనకయ్య ఆ మైకంలో.

'కనకయ్యకు ఎప్పుడు ప్రొద్దుకూకుతుందా అనే ఆలోచన తప్ప యితర ఆలోచనే లేదు. తండ్రికి ,ఎన్నో రకాలుగా బాసలుచేసి ఆయన్ను బండెక్కించాడు. రెండు రోజుల్లో పార్వతితో అత్తగారింటి కెళ్ళాడు. అతనికి యిప్పుడేదో ఇంద్ర పదవి లాంటిది, యింతవరకూ, ఏ మానవుడూ జయించలేని దేదో తను జయించి నట్లుగా తలపోస్తున్నాడు.

పార్వతి హృదయంలో యింత బ్రహ్మాండమైన ప్రేమ దాగివుందా ! తనను ఎంత ప్రేమగా చూస్తోంది! ఆ రాత్రి పార్వతికూడా భోజనంచేసి గదిలో కొచ్చింది. అప్పుడు, ఆమెకేసి పరకాయించి చూశాడు. పార్వతి

ఎంత అందంగా వుంది - తనని మామగారూ అత్తగారూ ఎంత మర్యాదగా చూస్తున్నారు! పార్వతి కనకయ్య ప్రక్కగా పడుకుంది.

'పాలు తాగుతారా?' అన్నది పార్వతి.

'ఇప్పుడు కాదు. మరో అరగంటుండి......' అన్నాడు, ఆమె చెంపల్ని తాకితే మాసిపోతా యేమో నన్న భయంగా తాకుతూ.

'మీ తమ్ముళ్ళకు పొలం వ్రాసిస్తారా?' అన్నది దగ్గరకు జరిగి.

'ఆఁ. ఆ సంగతు లిప్పుడెందుకులే.....రేపు మాట్లాడుకుందాం.' అన్నాడు చక్కని సమయాన్ని పాడుచేస్తుందేమో ననుకుంటూ.

'చూడండీ! మీరింత వెర్రిబాగుల వారు గను కనే, మీ అమ్మ నిన్ను తోలు బొమ్మని ఆడించిన ట్లాడించింది. ఆమె పోయింది, మీ వాళ్లు ఆ తాడును పట్టుకున్నారు. అంతేలే, తాడు యెవరు లాగినా బొమ్మ ఆడుతుంది. దానికేం తెలుసు...ఆడటమే దాని పని...' అన్నది పార్వతి కొంచెం ఎడంగా జరిగినదల్లా దగ్గర కొస్తూ.

'నువ్వనేది నా కర్థం కాలేదు......' అన్నాడు కనకయ్య ఆమె పెదాల కయిన సున్నపు మరకల్ని తుడుస్తో.

'ఆఁ, నాకెందుకొచ్చిన బాధ! ఇంకా స్త జరుగు, నిద్దరొస్తున్నది.' అన్నది పార్వతి అతని నడుము చుట్టూ చెయ్యి వేసి.

'చెప్పరాదూ, ఇంతలోనే కోపమా!' అన్నాడు కనకయ్య.

'ఆలోచించాల్సింది నువ్వు. ఒకరు ఆలోచించి పెడితే చేసేవాడు ఏమంత గొప్పవాడులే. పోనీ గానీ, పాలు చల్లారి పోతాయి. తరువాత సహించ వంటారు' అన్నదామె.

'సహిస్తాయి కానీ... చెప్పు...'

'నా మాటల్లో వుంటానంటే...'అన్నది పార్వతి.

'ఉంటా...' అన్నాడు కనకయ్య ఉండనంటే యీ కాస్తజాగా దొరక దేమోననే భీతితో.

'నామీద నమ్మకముంటే, ఆస్తి నాపేర రాసెయ్యి. రేపు మనకీ పదిమంది కలుగుతారు. ఉన్నది దాన ధర్మాలు చేస్తుంటే, మన గతి చివరకు నాల్గు కొంగులు ముడెయ్యాల్సిందే...' అని అతని మొహం వైఖరి ఎలా వుందోనని సాలోచనగా చూచింది పార్వతి.

కనకయ్య పది నిముషాలు మాట్లాడ లేదు. అతని వైఖరి చూసేసరికి పార్వతికి భయం వేసింది. కానీ కనకయ్య పార్వతికంటే కూడా భయపడ్డాడు. పార్వతి ఓ రకమైన స్వప్రయోజనం కోసం ఈ నాటక మాడు

తున్నదని కనకయ్యకు తెలీదు. పిట్టగింజలుతిని, ఉచ్చులో పడకుండా ఎగిరి పొయ్యేటట్లుందే అనుకున్నది పార్వతి.

'సరే నీ యిష్టం...తగలబెట్టు. యింకోరికైతే నా సలహా దేనికి? నీ సుఖమే నా సుఖం.' అని నిరసనగా అటు తిరిగి పడుకుంది పార్వతి.

ఆమె ముఖం చాటయ్యేటప్పటికి, కనకయ్య కళ్ళకు చీకట్లు కమ్మాయి. పెద్ద చిక్కే తెచ్చి పెట్టిందనుకున్నాడు.

'చూడూ. నీకోపం వస్తుందంటే యిక నేనేమీ మాట్లాడను. ప్రాధేయపడుతున్నారని గానీ...'అన్నాడు కనకయ్య.

'మళ్ళీ ఆ పాతపాటే పాడతా రేమిటి? నే కాదన్నానా? పొలం వ్రాసియివ్వటం మంచిదికాదన్నాను కానీ, అంతగా కాకపోతే ఏడాదికో నాల్గు పుట్లు వాడ్లు తోలితే సరి. అంతే కానీ ఆస్తి రాసిస్తానంటా రేమిటి? అందుకనే నిన్ను అందరూ ఆడిస్తున్నారు.' అన్నది పార్వతి.

'అలాంటప్పుడు ఆస్తి నీ పేరెందుకు?' అన్నాడు కనకయ్య. ఈ ప్రశ్నకు ఏమి జవాబివ్వాలో పార్వతికి అర్థంకాలేదు. అయినా మాట ఏదో వొకటి అనాలిగా.

'నీకు తెలీదు. ఒకరు చెప్తే వినవు. ఏం లాభం; ఎన్ని గుణాలున్నా? ఆస్తి నీ పేరుంటే అన్నీ చిక్కులే.

నా పేరవుంటే అన్ని విధాలా ఉపయోగముంది. నీ వాళ్ళకు పెట్టితే నే కాదంటానా? నాల్గు పుట్లు తోలితే సరి. సుఖంగా కాలం వెళ్ళమారి పోతుంది. రాయక పోయినా చింతలేదు' అన్నది పార్వతి.

'సరే నీ యిష్టం...' అన్నాడు కనకయ్య.

పార్వతి లేచి గ్లాసులోని పాలు అతని కందించింది. ఎంత రుచిగా ఉన్నాయి ఆమె అందించిన పాలు!

తనలో కుట్రా, ద్రోహబుద్ధిలేనివాడు, తన ఎదుటివార్ని కూడా అదే స్థాయిలో చూస్తాడు. అందుకే లోకంలో ఎక్కువభాగం నిష్కపటులే వంచింపబడుతుంటారు. అలా వంచింపబడిన వారిలో, ఎక్కడో ఒకడు తిరిగి కోలుకుంటాడు. తక్కినవారు అగాధాల్లోకి త్రోయబడి, వెలికి రాలేక అందులోనే మూలుగుతూ, కాలగర్భంలో కలసి పోతుంటారు. కనకయ్య ఆస్థినన్నా వ్రాసి యివ్వాలి— లేదా పార్వతినన్నా వొదలాలి. పార్వతిని వొదలడం అతనివల్ల కాలేదు.

ఆస్థి మొత్తం సర్వహక్కులతోనూ పార్వతి పేర రిజిష్టరుచేసి బయటపడ్డ పదోనాడు, కనకయ్యపేర వుత్తరం మొచ్చింది. ఆ కవరు పార్వతి అందుకుని చదువుకుంది.

'చిరంజీవి కనకయ్యకు,

మీ తండ్రి చిరాయువులుగా దీవించి వ్రాయునది. ఉభయకుశలోపరి. నీ ఆస్థి నీ భార్యపేర వ్రాసిన సంగతి తెలిసింది. మంచిపనే చేశావు. భాగ్యవంతుణ్ణి చెడ గొట్టేవాడూ లేడు; దురదృష్టవంతుణ్ణి బాగుచేసే వాడూ లేడు. కానీ ఒక్క విషయం. అదృష్టం జీవితంలో ఎప్పుడో ఒక్కసారే తలుపు కొడుతుంది. మెలుకువగా వున్నవాడు తలుపు తీస్తాడు; పండిపోతాడు. అదృష్ట హీనుడు నిద్రపోతూనే వుంటాడు. రాఘవమ్మగారు నిన్ను దత్తు తీసుకునేప్పుడు, నువ్వు మేలుకునే వున్నావని అను కున్నాను. కానీ యిప్పుడు తెలిసింది నువ్వు నిద్రపో తున్నావని. నీ తాత కూడా యిలాగే రాసి, ఫకీరై పోయినాడు. ఆ పేరే నీకూ పెట్టాము పొరపాటున. కానీ ఆచారభంగం కాకుండా నీ తాతపేరు నిలబెట్టావు. భగవంతుడు నీకు బిడ్డల్నిస్తే వాళ్ళకు చెప్పు, 'కనకయ్య పేరు పెట్టవొద్దని'. మీతాత కనకయ్య చేసినదానికి, మాచేత తిట్లు తింటున్నాడు. రేపు నీ ముందువారుకూడా నిన్ను తిట్టుతారు. సుఖంగా వుండు.'

నీ తండ్రి

చలపతిరావు

ఆ వుత్తరంలో తన నిజస్వరూపం పార్వతికి గోచరించే సరికి వళ్లు మండిపోయింది. ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చింపి పారేసింది. ఆనాడు కాదుకదా, యీ నాటికీ కనకయ్యకు ఆ వుత్తరం సంగతే తెలీదు. కనకయ్య భార్యతో కూడా గృహోన్ముఖుడై నాడు ఎంతో సంతోషంతో. ఏదో రాజ్యాన్ని జయించి రాణి వాసాన్ని బందీగా పట్టుకొస్తున్న స్థాయిలో ఉన్నాడు.

౫

ఆస్తి రిజష్టరు చేసిన రాత్రి కూడా కనకయ్య కులాసాగానే గడిపాడు. పాలు తాగాడు, పనసతొనలు తిన్నాడు, ఆనందడోలికల్లో ఊగాడు. కానీ యిప్పుడు ఆ పాలూ లేవు, ఆనందడోలికల్లో ఊగటం అంతకన్నా లేదు. పార్వతి కనకయ్యను చూచీ చూడనట్లుగా నటించ సాగింది. చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ఏం ప్రయోజనం? స్వాతికార్తెకు ముత్యపు చిప్పలా నోరు తెరచుకునే వున్నాడు కనకయ్య ఆమె దయాభిక్షకోసం. ఎప్పుడన్నా ఒక బిందువు పడితే సంతోషిస్తున్నాడు.

పేరంటానికి వెళ్ళిన పార్వతి రాత్రి పదకొండు గంటలు దాటిన తరువాత వచ్చింది. సన్నటివాన తుప్పర పడుతోంది. బయట కారు ఆగిన శబ్దమైంది.

తన యింటికా కారు! కిటికీలోంచి చూచాడు కనకయ్య. కారులోంచి పార్వతి దిగింది. ఆ కారులో నుంచే ఒక చెయ్యి బయటికిపెట్టి 'వస్తాను' అన్నట్లుగా అంటున్నాడు లోనివ్యక్తి. పార్వతికూడా అలాగే వూపింది. కారు స్టార్టు అయిన శబ్దం వినిపించింది...

తలుపు తీశాడు కనకయ్య. ఆమె వాలకం చూస్తూవుంటే అతనికి అనుమానం కలిగింది.

'పేరంటానికి వెళ్ళి యింత సేపటికా రావటం?' అన్నాడు కనకయ్య రుసరుస లాడుతూ.

'కావొద్దూ...మాటలా? పెద్ద భాగ్యవంతుల యిల్లు. మనయిల్లా బుడుంగున చేసుకోటానికి...?' అన్నది పార్వతి.

'ఆ కారులోని వారెవరు?' అన్నాడు.

'సుశి...' అన్నది.

'సుశి! చొక్కా తొడుక్కుంచేం?.....ఆడది చొక్కా తొడుక్కుంటుందా?' అన్నాడు అనుమానంగా.

'సుశి కూడా చేతులున్న చొక్కాయే తొడుక్కుంటుంది. యింట్లో కూర్చుంటే ఫ్యాషన్‌లు నీకేమి తెలుస్తాయి? ఓయి నీ అనుమానం దొంగల్దోలా. పడుకుందాం పద...' అని చెయ్యి పట్టుకుని గదివైపు నడిచింది పార్వతి. దాంతో కనకయ్య నరాలు చప్ప బడి ఆమె ననుసరించాడు.

కనకయ్యా, పార్వతీ; రెండు భిన్నతత్వాలు, అభిరుచులు, ఆదర్శాలు గలవారు. కనకయ్య తన వాంఛా తృప్తిని అనుభవించు తున్నాడు.

పార్వతి చుట్టూవున్న ప్రపంచం ఆనందంగా హాయిగా వుంది. కాస్త ట్రౌజర్, కోటూ, బూటూ, సిగరెట్టు యిలాంటి నాగరికతలేని కనకయ్య; ఆమె దృష్టిలో పిపీలికంలా కనిపిస్తున్నాడు. తప్పు చేసినా గొప్పగా చేయాలనే ఉద్దేశ్యంతో మరొక మార్గంలోకి సునాయాసంగా వెళ్ళిపోతో వుంది పార్వతి.

ఈ విభిన్న తత్వ ద్వయం కలుసుకోవటం, కలపటం కూడా కష్ట సాధ్యమైనపనే! ఈ ప్రయాణీకుల్లో ఎవరు ముందు బోల్తాపడతారు? గాయా లెవరికి తగుల్తాయి? ఎవరు ఉత్తములు? ఎవరు నీచులు? అని నిర్ణయం చెయ్యటం అట్టే సులభమైంది కాదు. యిద్దరూ పతనంకావొచ్చు... లేదా ఒకరు మాత్రమే కావొచ్చు. దానికి గతించిన జీవులే ఆదర్శప్రాయులు.

ఆనాడు సినిమాకు పోయి యింటి కొచ్చిన కనకయ్య తలుపు తడుతూ—

'పార్వతీ...' అన్నాడు.

సమాధానం రాలేదు. నిద్రపోతూ వుందేమో ననుకొన్నాడు.

'పార్వతీ...' యింకొంచెం స్థాయిలో పిలిచాడు.

పది నిముషాలకు తలుపు తీసింది పార్వతి. ఆ వేషం చూసేసరికి కనకయ్యా గతుక్కు మన్నాడు. తను యింతవరకూ చూడని పట్టుకోక కట్టింది. రవికె మీాది జలతారు మెరుస్తోవుంది. సినిమాకు రమ్మంటే 'తల నొప్పిగా వుంది' అన్నది పార్వతి. మరి యింత తీరిగ్గా, అమరిగ్గా, ఎందుకు ముస్తాబైంది?

నాలుగు మెతుకులు కొరికి ఆమె ప్రక్కనే పడుకున్నాడు. వెన్నెల కిటికీ లోనుంచి పడుతున్నది. అటు తిరిగి పడుకున్న పార్వతిని తనేమీా పలుక రించ లేదు. ఆమె కూడా అతన్ని కదప లేదు. కిటికీలోనుంచి పడుతున్న వెన్నెల్ని చూస్తూ ఆలోచించు తున్నాడు కనకయ్య. అలా రెండు గంటలు గడిచాయి. వెన్నెల నీడ బాగా చాచుకుని గోడకు తాకుతున్నది. గోడకు ప్రక్కగా సగం కాల్చి నలిపివేసిన సిగరెట్టు కనిపిస్తున్నది. ఎక్కడిదీ సిగరెట్టు? తను కాల్చడు. కాల్చే మరోప్రాణి యింట్లో లేదాయె. పార్వతి బాగా నిద్రలో వుందని ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసల్నిబట్టే తెలు స్తూంది. అనుమానంతో లేచి, ఆ సిగరెట్టు పిక్క అందు కుని చూచాడు. సిగరెట్టే! పాడు వాసన కొట్టింది, పారేశాడు. అలమరా తీశాడు. గాజు గ్లాసులో పాలు కాసిని కనిపిస్తున్నాయి. ఈ చిదంబర రహస్యం ఏమిటి? అలమరా తలుపులు యధాప్రకారం వేసి ఒకసారి పార్వ

తిని చూచాడు. అతని శరీరం కోపంతో ఉడికిపోయింది.

'పార్వతీ' అని గట్టిగా కుదిపి లేపాడు. ఆమె బద్ధకంగా యిటు పొర్లి—

'ఆఁ ఏం కొంప మునిగి పోయింది? అన్నది చిరాకుగా.

'మునుగుతుంది. ఎందుకు మునగదూ? ఈ గది లోకి ఎవ్వడొచ్చాడో చెప్పు' అన్నాడు. అతని కళ్ళు రోషంతో చింత నిప్పులకు మళ్ళేవున్నాయి.

కనకయ్యలోని పులి కాస్త గాండ్రించింది. ఇది వరకు తన్ను ఎలా చూచినా అతనికి యింత కోపం రాలేదు. దానికి ప్రబలమైన కారణం తన గత జీవితం తాలూకు నైచ్యం. తన స్త్రీతో మరో పురుషుడున్నా డంటే అతనిలోని క్రౌర్యం అతనికే ఎదురు తిరిగింది. కాని పార్వతికి తెలుసు; అతనిలోని పులి వూరికే అరుస్తూ వుందనీ, దానికి కోరలు లేవనీ, ఏమీ చేయలేదనీనూ.

'ఎవరొచ్చారు...?' అన్నది మొహం చిట్లిస్తూ.

'ఈ సిగరెట్టు ఎక్కడిది? ఆ బీరువాలో పాలు ఎవరు తాగారు?' అన్నాడు కనకయ్య.

'అయిందా నీ సోది?...సుశి!' అన్నది.

'సుశి! సుశి! ఎవరీ సుశి?' అన్నాడు కనకయ్య.

'నా స్నేహితురాలు...'

'మరి యీ సిగరెట్టు...'

'ఓయ్! బలేవాడివేనే! ఆమె, ఆమె భర్తా యిద్దరూ యింటికి కలిసొచ్చారు. ఇంటికి స్నేహితులొస్తే యిన్ని పాలన్నా యిచ్చుకోరా? ఇక పడుకో!' అని పార్వతి చిరాకుగా అటు తిరిగి పడుకుంది.

ఆమె సమాధానం అతన్ని సంతృప్తుణ్ణి చేయలేకపోయింది.

'నీ వేషాలు నా దగ్గర పనికిరావు' అన్నాడు కనకయ్య.

పార్వతి ఒక్క వూపున అతని వైపుకు తిరిగి—

'పనికిరాక...ఆఁ. చెప్పు విందాం. పనికిరాకపోతే ఏమౌతుంది?' అన్నది, దీనికి సమాధానం ఏమివ్వాలో కనకయ్యకు అర్థంకాలేదు. పది నిముషాలు యిద్దరిమధ్యా ఛెంగున గంతేసి పోయాయి.

'నీకొకటి చెప్తున్నా. నీకిష్టముంటే వుండు. లేకపోతే...' అనే కనకయ్య మాటను మధ్యలోనేఅడ్డి...

'అలాగే. నా పుట్టింటికి పోతాను. నీ మొహం చూస్తుంటే నాకూ డోకేస్తున్నది... అన్నది పార్వతి కాండ్రించి ఉమ్మి.

'పుట్టింటికి పోతావా? ఆస్తి యిందుకేనా నీకు రాసిచ్చింది?' అన్నాడు కనకయ్య.

'అడిగాను, రాసిచ్చావు. దీనిలో నీ కష్టార్జితం ఏమీ లేదే! ఒకరు నీకు యిచ్చినదాన్ని నువ్వు

నా కిచ్చావు.' అన్నది.

'నా ఆస్తి నా పేర వ్రాసెయ్యి' అన్నాడు కనకయ్య.

'వ్రాస్తాలే, పడుకో.' అన్నది పార్వతి.

కనకయ్య యీ దెబ్బకు గింగరాలు తిరిగాడు. చేయి దాటిపోయిందనుకున్నాడు. తను యింత లేకి పని చేసినందుకు బాధపడ్డాడు. గట్టిగా మాట్లాడితే తన యింటికే పోతుంది. తను యిక దిక్కులేని పక్షిలా అయి పోతాడు. అటు తండ్రికి తనేమీ సహకారం చేయలేక పోయినాడు. తిరిగి వారి మొహం ఎలా చూడగలడు? బయటికి పోయి జీవించగలడా? ఆ యిడ్లీ పళ్లెం తిరిగి తన తలెక్కుతుంది. ఇంతకాలం సుఖంగా వో నీడపట్టున బ్రతికిన ప్రాణిని, యిప్పుడు తిరిగి హింస పెట్టాలంటే అతనిలోని సుఖలాలసత్వం భీకరంగా ఎదురు తిరిగింది. రాఘవమ్మ కష్టపడి తన కొప్పజెప్పిన ఆస్తిని, తను ఒక్కమాటలో యితరుల కొప్పజెప్పాడు.

పార్వతి తనకు చేసిన లాలన క్రమేణా గుర్తుకు రాసాగింది. ఆమె ప్రతికదలికలోనూ మోసం చిరునవ్వు నవ్వుతోంది. తన తెలివితక్కువ తనానికి విచారించాడు. ఛ! దీన్ని నమ్మకూడదు. అయినా యిప్పుడు తనకా తెలివి రావటంలో గొప్పేమీ లేదు. ఆమె చేసే ప్రతి పనినీ గర్విస్తూ వూరుకోటంతన్నా తనేమీ చేయలేదు కదా! కానియ్యి రోజులు మారక పోతాయా, అనే

ఏదో మినుకు మినుకు మనే ఆశ, అతనిలో ఎక్కడో వెలుగుతూ వుంది.

కాలం గడిచేకొద్దీ పార్వతి ప్రవర్తన బహిరంగం కాజొచ్చింది. కనకయ్య ఏరకంగానూ నిరోధించేశక్తి లేనివాడైనాడు. తన ప్రాణానికి యీ డాక్టరెక్కడి నుంచి వూడిపడ్డాడు? వాడి వనేం ప్రయోజనం—అసలు సరుకులో మెతకుంటే; మొదట దొడ్డిదోవ—క్రమేణా సింహద్వారానే డాక్టరొస్తున్నాడు. పార్వతి క్రమేణా ఆ వైపుకు ఎలా పోతున్నదో, కనకయ్య మరో వైపుకు అంతే వేగంగా దిగజారి పోతున్నాడు.

౬

కనకయ్య దశ ఆఖరధ్యాయంలో పడింది. తన పాత్ర వున్నా, నాటకం ముగుస్తుంది, లేకపోయినా ముగుస్తుంది; అయినా తన పాత్ర నామమాత్రమైనదే. రాఘవమ్మ దగ్గరా, పార్వతి దగ్గరా సేవకుడి వేషం వేశాడు. మరి ఈ డాక్టరు దగ్గర తనపాత్ర... కాకపోతే మధ్యలో ఒక అంకంలో రాజు వేషం వేశాడు; ఆదేదో నాటకంలో చాకలి రాజైనట్టు. తన బలహీనతను ఆధారంగా తీసుకుని ప్రతి సమస్యా తనమీద సవారీ చేస్తూవుంది.

నిద్రగన్నేరు చెట్టుక్రింద పడుకున్నాడు. ఈ వెన్నెల క్రింద యిప్పుడు ఎన్ని ప్రాణులు సుఖపడుతున్నాయో గదా, అనుకున్నాడు. లోపల పార్వతి ముస్తాబౌతున్నది. కనకయ్యకు ఏదో ఆలోచన రావటం మూలాన, చప్పున లేచి గదిలోకి వెళ్ళాడు. పార్వతి ఎదురుగా వొస్తూ—

'మీరా...?' అని తిరిగి తన గదిలోకిపోయింది. కనకయ్య మనస్సు చివుక్కుమంది. తను భర్త, ఆస్తి యిచ్చాడు. యింతచేసినా ఆ డాక్టరు కేమిటి దీనిదగ్గర గౌరవం...అనుకుంటూ గదిలోకిపోయి కుర్చీలో కూర్చున్నాడు. అద్దం ముందు పార్వతి నుంచుని మొహానికి పౌడరద్దుకుంటున్నది. ఆ వాసన పీల్చి ఎంతకాలమైంది!

'నా మాటవిను...ఆ డాక్టర్ని యింటికి రానీక...' అన్నాడు కనకయ్య. పార్వతి అద్దంలోంచే చూస్తూ—

'నీ కనవసరం ఆ విషయాలు. పోయి పడుకో' అన్నది.

'చూడు, యిప్పటికే రెండెకరాలు అమ్మావు. పుట్టింటికని వెళ్ళావు. నాకు తెలుసు నువ్వు ఎక్కడికి వెళ్ళిందీ. ఆ డాక్టర్నేసుకుని తిరిగొచ్చావు. వాడికి రోగమా పాడా— బోర్డువుంది... నువ్వు దొరికేవు... వాడి సంపాదించేఅక్కరకూడ లేకుండాపోయింది. వాడూ, వాడి [illegible]కాళ్ళూ చూస్తుంటే నాకు మండుతున్నది'

అన్నాడు కనకయ్య.

'నీ ఇడ్లీ పళ్లెం ముందు పనికి రాలేదా ఆయన బోర్డు?' అన్నది పార్వతి కోపంగా.

'పార్వతీ...నువ్వు నన్నేమన్నా నాకు సిగ్గులేదు. నీ కోసం నే నెటువంటి పనిచేశానో తెలుసా? నీపొందు కోసం...నీ అందం చూస్తుంటే, నాకు ఏమీ కనిపించటం లేదు. నీ దగ్గర స్థానముంటే అంతేచాలు...రా... ఒక్కసారి...నీ ప్రేమకోసం....అమ్మని....' అన్నాడు కనకయ్య.

'అమ్మను ఏం చేశావు?' అన్నది భీతిగా పార్వతి.

'ఆఁ. ఏమీ చేయలేదు. ఆచారిగారింటి కెళ్లాను. 'నాభి' అని వ్రాసివుంది ఓసీసామీద. అది తింటే చస్తా రని నాకు తెలుసు. మన మధ్య అడ్డంగా వుందని ఆ మాత్రవేసి చంపాను. లోకానికి తెలీదుగానీ లేకుంటే ఉరితీసేవారు...నీ ప్రేమకోసం అమ్మనుకూడా చంపాను' అన్నాడు కనకయ్య తలవొంచుకుని!

'ఇంతవరకు ఈ రహస్యం నాకూ ఆ దేవుడికీతప్ప మరెవరికీ తెలీదు. నీ లాలనచూసి, ఆస్తి నీకు రాసిచ్చాను. తల్లీ తండ్రి అడుక్కు తింటున్నా సహించి, నా సౌఖ్యంకోసం నీ పేర వ్రాసిచ్చాను. అయినా నీవు నిరాదరణగానే చూస్తున్నావు.'

'నీ అందం చూస్తుంటే నాకు పిచ్చెత్తు తున్నది.

రా...బయట తలుపేయి...సుఖంగా వుందాం...ఈ సౌఖ్యాన్ని మరొకడు అనుభవిస్తుంటే నేను చూడలేను' అన్నాడు కనకయ్య.

పార్వతి వొణికింది...'నువ్వు హంతకుడివి. నిన్ను నమ్మకూడదు. రేపు నాకూ విషం కలిపి పెట్టొచ్చు. ఛీ! బయటికిపో! లేకుంటే నలుగుర్నీ పిలిచి నీబండారం అంతా చెప్తాను' అన్నది. కనకయ్య మరేమీ మాట్లాడకుండా బయటికొచ్చి తన మంచంవైపు నడిచాడు.

మరో గంటకు డాక్టరొచ్చాడు. తలుపు గడేసిన చప్పుడు వినిపించింది. రెండు మబ్బుతునకలు దూరంగా పోయి ఆకాశపు నీలిమల్ని పులుముకుని మాయమయ్యాయి. తన తల్లిచావు, తెరుచుకున్న నోరూ, కళ్ళూ, భయంకరంగా కనిపిస్తున్నాయి. తను వేసిన నాభి ఆమెలోని ప్రతి నరాన్ని ఎలా గుంజి ప్రాణాలను పిండాయో అత నూహించేటప్పటికి, వొణికిపోయాడు. ఆమె మరణవేదనలో ఏమనుకుందో...తను దేనికోసం యీపని చేశాడు? ఆ పనివల్ల అతనికేమి ప్రయోజనం కలిగింది? పార్వతి అందానికా...అంత అందమైనదా పార్వతి...రంభా...ఊర్వశా......ఆ అందానికి తను ఎందుకు బానిసయినాడు?...ఛీ! ఏమిటా అందం... మనిషి అందం లేకపోతే బ్రతకలేడా? తను పిచ్చివాడా? ఛీ! ఛీ! డోకేస్తున్నది పార్వతి రూపం...ఎందుకు తన

కిట్లా కనిపిస్తున్నది? ఆమె ముఖం ముడతలు పడ్డది. శరీరం, మెడమీది వొంపులు అలా జారిపోయినాయేం! తల ముగ్గుబుట్టలా పండిపోయిందేం......అదే ముసలి దైందా? కనకయ్య పెద్దగా నవ్వాడు. ఆ నవ్వు డాబా గోడలకు తగిలి చిద్రుప చిద్రుపలైంది.

పార్వతి కిటికీ తలుపుతీసి - ఏమిటా వెర్రి నవ్వు? నీ కేమన్నా పిచ్చెత్తిందా ఏం? అని యథాప్రకారం కిటికీ తలుపేసింది మళ్ళా.

'పిచ్చి...నాకు...పిచ్చి' అని తనలోతను గొణుక్కుంటూ మంచంమీంచి లేచాడు. గదిలో కిక్కిరిసి వున్న ఆనందం - బయటదిశా పలయాల్ని తాకుతున్న ఆవేదన, ఆరాటం...రోడ్డు మీదికి నడిచాడు కనకయ్య.

* * *

ఆ కనకయ్యే యీ తెనాలి లైబ్రరీ అరుగుమీది కనకయ్య.

'ఓ దీనజనులారా! డాక్టర్ని ఆడదాన్నీ నమ్మకండి. ఆ వెంకట్రామయ్య గాడి హోటల్లో జిలేబి తిన్నారా, మీ మనస్సులు మారిపోతాయి...' అని అంటూ వుంటాడు.

ఇంతకాలమైనా పార్వతి ఇంకా ఏలూరులోనే వుందా? ఆస్తినంతా ఉంచిందా? అమ్మేసిందా? యిప్పుడే ప్రియుడితో వున్నది? ఈ సంగతులు నాకేం తెలీవు

కానీ, కనకయ్య మటుకు ఆ లైబ్రరీ అరుగుల మీద ఇప్పటికీ కనిపిస్తూనే వుంటాడు.

స్త్రీ అందం కోసం ఎన్నో యుద్ధాలు జరిగాయి. వేలమంది జనం నరుక్కో-బడ్డారు. కోట్ల రూపాయలు బూడిద చేయబడ్డాయి. వారి జ్ఞాపకార్థం కట్టిన గొప్ప గొప్ప కట్టడాలు యింకా యీ భూమిమీద నిలిచి వున్నాయి. వాటిని కవులు కావ్యాలు వ్రాశారు. గాయకులు గానం చేశారు. ప్రదర్శకులు ప్రదర్శనా లిచ్చారు. కానీ కనకయ్యకు లోకంనుండి 'అప్రయోజకుడు, శుంఠ' అనే పదాలు మాత్రమే లభించాయి!

—०ॐ०—

## 4

# బూర్జువా నాగరికత

అతన్ని నాలుగురోజులనుండీ ఆ వంతెనమూల చూస్తున్నాను. అక్కడేముష్టి అడుక్కొంటూకనిపించేవాడు. అతన్ని చూస్తే దరిద్రానికి ప్రాతినిధ్యం వహిస్తున్నాడని ఎవరికైనా యిట్టే స్ఫురిస్తుంది. అతని వయస్సు అంచనా కట్టటం చాలాకష్టం. చాలా సన్నగా, తూనీగలాగా, దర్భపోచలాగా ఉన్నాడు. ఒక గోనెపట్టాను మొలకు కట్టుకొన్నాడు. ఇంకో మురికిగుడ్డను వొంటిమీద వేసుకొన్నాడు. చిన్నపాలడబ్బా, ఒకమూకుడు, వెదురుకర్ర అతని ఆస్థిపాస్తులు.

ఒకనాడు అతనికీ ఆస్తివుండేదేమో నాకు తెలీదు. నేను తెలుసుకోటానికికూడా ప్రయత్నించలేదు. తెలుసుకొని అతని పరిస్థితికి విచారించటం నాశక్తికి మించినపని. అందర్నీ అడిగేవాడు. కొందరు మాత్రమే యిచ్చేవారు. అతను తనబాధనంతా మాటల్లో కూర్చేవాడు. వాటిని ఉచ్చరించేవాడు.

అవి ఎవరికీ వినపడవో, లేక వినిపించినా, పట్టించుకోకోగాని, అతన్ని దులబరించుకొని వెడుతుండేవాళ్ళు.

ఒకప్పుడు అతనూ రకరకాల కలలు కనిఉంటాడు. భావిని గురించి అందంగాను, సుఖంగానూ ఆలోచించుకొని ఉంటాడు. తనూ, తనప్రియురాలు, మేడమీద గదిలో, మెత్తని మంచంమీద, వెచ్చని రగ్గుకింద...ఊహించుకొని ఉంటాడు. ఇద్దరు పిల్లలు–చిన్న కారు–సాయంత్రం షికారు— మంచి భోజనం— కానీ ఇవన్నీ కలలుగానే మిగిలి పోయినాయి. వాటిని దున్ని సేద్యంచేసి యథార్థఫలితాన్ని గుంజలేకపోయినాడు. ఏది ఏమయితే నేంగాని, ఒకజీవి– అందులో– మానవుడు– జీవితమంటే ఏమిటో తెలుసుకోకుండానే, బతుకులోని వెలుగులు చూడకుండానే దాటిపోయాడు.

ఇవ్వాళ ఉదయం నేనతన్ని చూచాను. చని పొయ్యాడు. నోరు తెరుచుకొని వుంది. చేతిలో పాల డబ్బా అట్లాగే చాచుకొని ఉన్నది. దాన్నిండా కార్లు, లారీల దుమ్ముపడ్డది. ఆ పక్కనే మూకుడు. ఇంకొంచం దూరంలో కర్ర. ఫుట్‌పాత్ కిందగా పడిఉన్నాడు. అతనికి భార్యాబిడ్డలూ ఉండి ఉండరు. అతన్ని కన్న వారుగూడా లేకపోవచ్చు.ఉన్నా యితనికోసం విచారించే స్థితిలో ఉండరను కొంటాను. ఎక్కడున్నారో? ఏమి చేస్తున్నారో? ఇతని మరణవార్తను వాళ్ళకు తెలియ పరచే దెవ్వరు?

ప్రతికేహొక్క ప్రతిమనిషికీ ఉన్నది. దానికోసం

ప్రతివాడూ పోరాడాలి. అదిఎప్పుడూ, ఎవ్వరూ కాదనరాని మహత్తరవరం. అదే నేటిమానవునికి మృగ్యమయింది. అతను తిండిలేకనే మరణించాడు. ఆ విషయం నాకు తెలుసు. కాని పత్రికలు ప్రభుత్వము 'రోగము వలన మరణించినాడని తెలియు చున్నది' అని మాత్రమే అంటారు. ఇది నేను కళ్ళారా చూసిన దృశ్యం. అతని వేపు, కొంచెంసేపు చూచాను. ఆ స్థితిలో నన్ను నే నూహించుకొని...గుండెలదిరి నరాలు కొంకర్లు పోయి నాయి, నెత్తురు గోళ్ళచివర్ల కొచ్చింది. పక్షవాత రోగికి మల్లే కాళ్లు చేతులు తేలిపోయినాయి. నిలబడలేక పోయాను.

మధ్యాన్నం కాఫీకోసం బయలుదేరాను. భయం భయంగానే. గుండె దిటవుచేసుకొని మెల్లగా తలత్రిప్పి, తొలిసారి యుద్ధచిత్రం చూస్తున్న కుర్రవాడిలాగా వంతెన మూలకు చూచాను. ఆ శవం అక్కడ్నే వుంది. దానిచుట్టూ ఐదారుగురుచేరి శోకాలుపెట్టి ఏడుస్తు న్నారు. అందులో ఇద్దరు ఆడవాళ్లు. బహుశా ఆ ముస లావిడ అతని తల్లికావొచ్చు. తనలోనుంచి, తనరక్తాన్ని కోరికలను, కలలను, పంచుకొని – ఏదో తమాషాయిన లోకాన్నుండి వొచ్చినట్లు – తనలోకి, తనచేతుల్లోకి ఒడిలో కొచ్చాడు. అతన్ని తను లాలించింది. ముద్దు పెట్టుకొంది. స్తన్యమిచ్చింది. తనను తాను, తనరూపం,

అతనిలో చూచుకొని, ఈ విచిత్రానికి ఆశ్చర్యపడి వుంటుంది. ఆతల్లి ఈనాడు—తనబిడ్డ—తనముందు—కదలక మెదలక—కొయ్యలాగా బిగుసుకుపోవటం చూసి—అర్థం చేసుకొంటాను. నాకు తెలుసు.

గోలున ఏడుస్తున్నారు. అతని అవయవాలను నిమురుతూ, ముద్దుబెట్టుకొంటూ, కదుపుతూ ఏడుస్తున్నారు. ఒకతను, అందర్నీ ముష్టి అడుగుతున్నాడు; అతన్ని దహనంచేసేందుకు డబ్బును. దరిద్రమెంత భయంకరమైనది! వ్యక్తిని ఎంతటి నీచంలోకి లాగుతుంది!!

కొందరిస్తున్నారు. నా పేరును గూడా కొందరిలో కలుపుకొని, బయలుదేరాను. మనస్సు మురుగు గుంట లాగా లుకలుకలాడుతున్నది. ఆమె కొక్కడే కొడుకట. ఆ రెండో స్త్రీ అతని అక్కయ్యట. భార్యకు కడుపుచేసి దాని మొగుడు బైరాగుల్లో కెళ్ళాడుట. ఇప్పుడొక బిడ్డతల్లి ఆ 'అక్కయ్య!' 'ఏదేశమేగినా ఎందుకాలిడినా! పొగడరా నీ తల్లి భూమి భారతిని.'

కాళ్లు లాగుతున్నాయి. ఊపిరి, తిత్తితో లాగుతున్నట్లు ఉక్కిరి బిక్కిరౌతున్నాను. నేనూ మాఅమ్మకు ఒక్కణ్నే! నాకూ ఒకే వొక చెల్లెలున్నది. మాబావ, మా చెల్లెల్ని వదిలి, బైరాగుల్లో కలిస్తే, నాకీ ఉద్యోగము ఊడిపోయి తిండిలేక, అట్లాగే ఆ వంతెనదగ్గర... మెదడులో కణతా యింజెన్లు పనిగెత్తాయి.

సాయంత్రం మళ్ళీ బజారు కొచ్చాను. ఆ శవం అక్కడ్నే ఉన్నది. దానిచుట్టూవడ్చే 'బంధువులు' మాత్రంలేరు. ఏమయ్యారు? ఎటు వెళ్ళారు? ఇంత ఆలస్య మెందుకయింది? ఎందుకు పారెయ్యలేదు? అభ్యంతరాలేమిటి? ఇట్లా ఆలోచిస్తూ అక్కడే నిలబడి ఉన్నాను. మునిసిపల్ చెత్తబండి ఆ శవాన్ని తీసుకెళ్ళింది. అతని శవం ఇంకా అక్కడనే ఉన్నట్లు...దానిచుట్టూ అతని అత్యంత ఆప్తబంధువులుచేరి హృదయాలు డెక్కపడేటట్లు... ఊహించుకొని కదలిపోయినాను. ఆబంధువులు...కన్నతల్లి...తోబుట్టువు...ఏమయ్యారు? ఎక్కడున్నారు??

వారంరోజుల తరవాత, సాయంత్రంవేళ, రైలు స్టేషను కెళ్ళాను. దూరంనుండి ఏడుపులు వినిపించాయి. విద్యుత్ తగిలినట్లు వొణికాను. గాలిలో ఈదుకొంటూ అక్కడి కెళ్ళాను. ఒక శవం, దానిచుట్టూ ఐదారుగురు మనుష్యులుచేరి ఏడుస్తున్నారు. దగ్గరగా వెళ్ళిచూశాను. మెదడులో దీపం వెలిగినట్లయింది. ఒక ముసలితల్లి... బిడ్డను పుట్టించి బైరాగుల్లో కలిసిన భర్త కలిగిన అక్కయ్య. దహనంకోసం అందర్నీ యాచించే... చుట్టూచేరి ఏడుస్తున్నారు.

1951 సమీక్ష.

# 5

## ప్రణయోపాసి

'నువ్వు చెప్పే అలల సౌందర్యంలో ఎంత చూచినా కొత్తేమీ కనిపించటం లేదు. ఒకటే మోత. 'బీచీ బీచీ' అని చస్తావు కానీ, తీరా వొచ్చాక వో అర గంటకే మొహం మొత్తుతుంది. అలా ఏ సెంటరులో నన్నా నుంచుంటేనో, సినిమా వొదిలి నప్పుడో ఆ జనాన్ని చూస్తో వుంటే - యింతకన్నా బావుంటుంది,' అన్నాడు కోపంగా రామకృష్ణ.

'నిజమేరా. ఏదో కొత్తగాలి...' అని నీళ్ళు నమిలాడు శర్మ.

'ఒరే! నువ్వేమన్నా సరేకానీ, నాకు ఈ బీచీ అంటే చెడ్డ అసహ్యం. కొత్త అందమైన ఆడవాళ్లు, 'లా ఎఫైర్సు' అంతే. చూడు ఆ అల వొచ్చింది... అట్లా లక్షలు కోట్లు, ఏమిటో చెప్పొదూ నీ వర్ణన అందులో. ఇంత చవటవి కాబట్టే అయ్యాకు జంకి కమ్మటి దాన్ని వొదులుకొన్నావు' అన్నాడు రామకృష్ణ.

'ఏమండోయ్. మీ మాట నాకూ వినిపించింది. అందమైన ఆడది అంటే ఓ సంగతి నాకూ గుర్తుకొచ్చింది'

అంటూ వాళ్లకు కొంచెం దూరంలో కూర్చున్న అతను వాళ్ల దగ్గరకు జరిగాడు. తమ సంభాషణలో కలిగించు కున్నందుకు రామకృష్ణకు కొంచెం చిరాకొచ్చింది, శర్మ—

'ఏం సంగతి!' అన్నాడు.

'అందమైన ఆడదీ...ప్రేమ. చూచారూ! నేను చెప్పకోకూడదుగానీ ప్రేమనేది మహత్తరమైన తపస్సు. అది సిద్ధించిన వాడిదే జన్మ, ఏదో తింటున్నాము తిరుగు తున్నాము. జీవితానికి ఇంతకంటే పరమార్థము లేక పోయినప్పుడు ఆ జన్మ కేవలం వృథా' అన్నాడు నూతనుడు.

'నిజమే! అందమైన ఆడదీ, ప్రేమా వుండాలి. బాగానేవుంది, మరి ఇవి వుండాలంటే డబ్బుండ నక్కర లేదా ?' అన్నాడు శర్మ.

'నీ బొంద. నీకు డబ్బంటే నువ్వేం సాధించ గల్గావు?' అన్నాడు రామకృష్ణ.

'ఆc. వెధవ డబ్బు. డబ్బంటే నాకు లక్ష్యమే లేదు. చూడండీ, ఇందిరనే అమ్మాయి వుండేది. నేను చెప్తే మీరు నమ్మరుగానండీ— ఆ అమ్మాయి నోటితో 'యిదుగో ప్రసాద్! యీ అగ్నిగుండంలో దూకు' అంటే దూకేవాడినంటే నమ్మండి'అని అన్నాడు ప్రసాద్.

అతని మాట పూర్తికానివ్వకుండానే—

ఇప్పుడూ వున్నారు అలాంటివాళ్లు' అన్నాడు శర్మ కోపంగా.

నువ్వూరుకోరా శర్మా. నీ బతుక్కు- నువ్వా చెప్పొచ్చావా? పాపం నీ క్లాసుమేటు ఎంత ఏడ్చినా, మీా నాయనకు జంకి ఆమె నొదులు కున్నావు. ఎందుకు రా నీదీ వొక...'అన్న రామకృష్ణ మాట పూర్తి కానివ్వలేదు.

'ఆ మాటకే నా వళ్ళు మండుతుంది. నా పొజి షన్లో నువ్వుంటే నీ వీ మాట అనేవాడివి కాదురా' అన్నాడు శర్మ.

'నేనైతేనా...'

'ఎవరైనా ఒకటే, ఆ త్యాగం వాడి జన్మ కుండాలి గానండీ, మధ్యలో వచ్చేది కాదుసుమా. నేనూ ఇందిర అలా లతల్లా పెనవేసుకు పొయ్యామంటే నమ్మండి. ఇందిరను చూడంది నేను, నన్ను చూడంది ఇందిర బ్రతకలేకపొయ్యాము. అలా వుండేది మా స్థితి' అన్నాడు ప్రసాద్.

శర్మ సిగరెట్టు పెట్టెతీసి తను వకటి అంటించి అతనిముందు వుంచాడు.

'నాకు అలవాటు లేదు' అని సిగరెట్టు పెట్టెని యధాస్థానానికి నెట్టాడు ప్రసాద్.

శర్మ సిగరెట్ పొగ వొదిలి—

'నేను నా క్లాసుమేటు 'లవ్' చేసుకున్నామండి. మీరే న్యాయం చెప్పండి. యిందులో నా తప్పేమిటో మీరు చెప్పాలి. వారూ యిష్టపడ్డారు నాకివ్వటానికి. మా తండ్రి పడనివ్వలేదు' అన్నాడు శర్మ.

'అంతదాకా ఎందుకండీ! అప్పుడు సరిగ్గా మీ యీడే వుంటుంది నాకు. ఇందిర మీద ఏ ముహూర్తాన నా మనస్సు నిల్చిందో కానీ, అప్పటినుంచి నా ఆస్తి పాస్తి, సౌఖ్యాలు చూస్తే రోత పుట్టాయి. ఏమైనాసరే, మా నాన్న వొప్పుకున్నాసరే, వొప్పుకోకపోయినాసరే, యిందిరను పెళ్ళిచేసుకు తీరాల్సిందే! అలా ప్రేమించి వివాహం చేసుకుంటే ఆ జీవితానికి ఆకలౌతుందటండీ.' అన్నాడు ప్రసాద్.

'అరే కృష్ణా! ఆయన చెప్పినమాట సెంట్ పర్ సెంటు యథార్థం. నా క్లాసుమేటుని రోజు కోసారన్నా చూడందే నాకు ఆకలేసేదే కాదు' అన్నాడు శర్మ ఎంతో పొంగిపోతున్న సంతోషాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ.

'ఏడిశావు. అంత ప్రేమ వున్నవాడివేనా మీ నాన్నను చూస్తే వణికి పోయేవాడివి' అన్నాడు రామకృష్ణ కొంచెం తీక్షణంగా.

'అక్కడో సందర్భ మొచ్చింది. తెలిసి కూడా నువ్వు నన్ను ఫూల్ని చేస్తున్నావంటే యింకే మనుకో

వాలో అర్థం కావటంలేదు. నీకు ఎప్పుడైనా అలాంటి స్థితి వొస్తే తెలుస్తుంది నీ త్యాగం. అది కాదండీ. నేను నా క్లాస్ మేట్ నే చేసుకోవాలని పట్టుపట్టాను. మానాన్న మాటకూడా ధిక్కరించాను. మా అమ్మ బావిలో దూకి చచ్చిపోతానని వుత్తరం వ్రాసింది. లేకుంటేనా' అన్నాడు శర్మ ప్రసాద్ వొంక అప్పీలింగుగా చూస్తో.

'మీరు ఆమాట అనవొద్దు. తల్లి...తల్లేమి టండీ. 'ప్రేమ గొప్పదా? తల్లి గొప్పదా?' అని నన్నెవరన్నా అడిగితే ప్రేమే గొప్పదంటాను. నా విష యంలో ఇందిరను తప్పకుండా పెళ్ళిచేసుకుంటా నన్న ప్పుడు మా అమ్మ బావిలో దూకింది...' అన్నాడు ప్రసాద్.

'చచ్చిపోయిందా?' అన్నాడు శర్మ భీతిగా.

'ఆఁ. తీశారు లెండి. చచ్చినా నా మనస్సు మారేదికాదు. అసలు ఇందిర చాలా బీదది. నేను ఆ వయస్సులో వున్నా పరాయి స్త్రీని కన్నెత్తి చూచే వాడను కాను. ఒకరోజు నేను కాఫీ తాగుతో యిందిర యింటివైపు ఎందుకో చూచాను. అప్పుడు యిందిర కిటికీలో కూర్చుని ఏడుస్తున్నది. ఆమె కంటినుండి పడే ప్రతి నీటిబొట్టూ నా గుండెలమీద సమ్మెటతో కొట్టి నట్లు అయింది. ఛీ, ఛీ ఒక స్త్రీ ఏడుస్తో వుంటే ఆమెను నాబాధనుండి విముక్తిచేయలేని నాదీ ఒక జన్మేనా అని

పించింది' అన్నాడు. అప్పుడు అతని ముఖం బాగా నల్ల బడి పోయింది. రామకృష్ణకు అతన్ని చూస్తే ఎంతో జాలి కలిగింది. 'పాపం' అనుకున్నాడు అతను.

'నిజమే నండీ. మీరు చెప్తుంటే నా వెనుకటి జీవితం నేనూ నా క్లాసుమేటు, ఆనాటి మా సంభాష ణలు, అన్నీ సీన్సులా కళ్ళ ముందు కనిపిస్తున్నాయి,' అన్నాడు శర్మ సముద్రం కేసి విషాదంగా చూస్తో.

'నీ జోలె! నీదీ ఒక బ్రతుకేరా. నే నైతే ప్రాణం అలా యిచ్చేవాడిని తెలుసా!' అన్నాడు రామకృష్ణ.

'అందుకేనా సంవత్సరంనుంచీ ఆ అమ్మాయిని వశపర్చుకోలేక రోజూ స్కూలు నుంచి యింటిదాకా వొదిలొస్తున్నావు' అన్నాడు శర్మ చీదరింపుగా.

'నీ మాదిరి యాక్సిడెంటల్ లా నాకు చేతకాదు. అయినా దాన్ని నేను వొప్పుకోను. అన్నాడు రామ కృష్ణ మరో సిగరెట్ తీస్తూ.

'బాగా అన్నారు. మీరన్నది అక్షరాలా నిజం. ఇందిర దుఃఖానికి కారణం కనుక్కున్నాను. ఇందిరకు ఎంత తిరిగినా సంబంధం దొరకలేదు. దాంతో ఇందిర తండ్రి మంచ మెక్కాడు. పాపం ఇందిర హృదయం పసిది కావటంతో బేజారెత్తిపోయింది.

'ఎన్ని అవాంతరా లొచ్చినా, ఎన్ని ఆపద

లొచ్చినా నీకేం భయం లేదని ఇందిరకు వాగ్దానం చేశాను. దాంతో ఆమె హృదయం స్తిమితపడింది. అలా మా హృదయాల్లోని కోర్కెలన్నీ ఒకరి కొకరం అర్థం చేసుకున్నాము. ఇక నేం మా మధ్య మరో ధ్యేయం లేదు. నేనూ ఇందిరా...' అన్న ప్రసాద్ మాట ఆపుతూ-

'పెళ్లి చేసుకున్నారా?' అన్నాడు శర్మ.

'ఇంకా అప్పుడేనా? ఇది లోకం కదటండీ. మా మధ్య తొణికిస లాడుతున్న ఆనందం చూడ లేక కళ్ళల్లో నిప్పులు పోసుకుంది. మేము యీ లోకంలో వున్నామా-పాడా? ఇందిరా నేను కొమ్మకు తీగ పెను వేసు కున్నట్లుగా, పెన వేసుకు పోయాము ఆనందంతో. అదో లోకం. దూది లాంటి నేల. అలలు లేని మహా నీలాలు. వాటి మీద తేలి పోతో, సుదూరంలో ఆకాశం వంగిన వైపుకు పందె మేసుకుని పోతుండే వాళ్లం. ఏమిటో లెండి చెప్పకూడదు. మీరు కుర్రవాళ్ళు.' అన్నాడు దీర్ఘంగా నిట్టూర్చి.

'యగ్జాక్టే. నేను అదే సీన్సులోకి, డ్రీమ్సులోకీ పోయ్యానండీ. వీడు కుర్రకుంక. యింకా దారిలోనే వున్నాడు. రోజూ యింటి దగ్గర వొదిలిపెట్టి కాలేజీకి తీసుకొచ్చే ప్రిలిమనరీ స్టేజీలోనే వున్నాడు' అని నవ్వుతో కృష్ణ భుజం మీద చేత్తో ఒక చిన్న దెబ్బ వేశాడు శర్మ.

'వీడు యింకా కొన్నాళ్లుంటే కెల్లిస్ రోడ్డుకు పంపించాల్సి వొస్తుంది. వీడిమాటకేంగానీ తరువాత ఏమైంది' అన్నాడు రామకృష్ణ.

'ఒక్క క్షణం ఆగండి. తరువాత చెప్పుదురుగానీ, సరేకాని — నువ్వు ఆ అమ్మాయిని చేసుకో గల్గుదువుటరా?' అన్నాడు శర్మ.

'నేనా. వొప్పుకోమను' అని శర్మ ముఖంలోకి పందెం వేసేపోజులో చూచాడు రామకృష్ణ.

'మీరు వూరుకోండి సార్. నేను వొప్పిస్తాను వారిచేత. ఇదుగో శర్మగారూ. మీరు నాకు కొత్త. మీకు నేను కొత్తగదా! ఆమాట అట్లా వుంచండి. తరువాత ఆ సంగతి కొద్దాం. నేను యింట్లో పేచి పెట్టుకుంటాననేలోగా యిందిర తండ్రి హఠాత్తుగా చని పోయాడు. దాంతో సగం దెబ్బతిన్నది ఆమె. తల్లి కూడా మంచమెక్కింది.

'ఛీ! ఆమె కంటితో నన్నా యిందిర వివాహం చూడాలి అనే దృఢసంకల్పంతో నేను యింట్లో తెగ పడ్డాను. రోజు హోరాహోరిగా పోట్లాడాను. ఎవర్నీ లెక్కచేయలేదు. చివరకు...' అని అతను కంటనీరు పెట్టుకున్నాడు.

'ఏమైందండీ' అని శర్మ ఆదుర్దాగా అడిగాడు.

'తరువాత యిందిర ఆ దుఃఖంతో యీ లోకం

నుంచి...' అతనికి యికపైన మాటలు రాలేదు.

'తరువాత...' అన్నాడు శర్మ.

'దాంతో నా మనస్సు వికావికలై పోయింది. నా ఆస్తీపాస్తులు అన్నీ వొదిలేసాను. ఇలా గడుపుతున్నాను' అన్నాడు.

'తరువాత పెళ్ళి చేసుకోలేదా?'

'లేదండీ. ఇందరకే అంకితమై పోయినాను. నాయొక్క శేషజీవితాన్ని—ఆమె నామస్మరణచేస్తో ఆమెను కలుసు కుంటాను. ఈ జన్మలో కాకపోయినా మరో జన్మలోనన్నా మమ్మల్ని దేవుడు దంపతుల్ని చేస్తాడు' అన్నాడు.

'మీారండీ మనిషంటే? పీడూ వున్నాడు గడకు మల్లే పెరిగి, ఏంలాభం. చూడరా ఆయన. అంత వయస్సును వృథాచేసుకున్నాడు కదా తనని నమ్మిన వ్యక్తికోసం.'

శర్మ తల వొంచుకున్నాడు. తారు రోడ్డుమీాద కార్లు రాచుకుపొయ్యే శబ్దం, జనం రొద...

రామకృష్ణ లేచాడు. శర్మకూడా చేతులకు అయిన యిసుకను దులుపుకుని లేచి నడుస్తున్నారు. ఎందుకో ఆగి—

'మీారూ యిటే వస్తున్నారా?' అన్నాడు ప్రసాదు కేసి తిరిగి.

'లేదండి...ఉదయం నుంచీ భోజనం చేయలేదు.
మీ దగ్గరేమైనా...

శర్మ జేబులో నుంచి రూపాయి నోటు అతడి చేతులో పెడుతూ—

'పాపం! పోయి భోజనం చేయండి. లేదా మాతో రండి హోటల్ చూపిస్తాము' అన్నాడు.

అతను రూపాయి నందుకొన్నాడు. అలా అందుకొంటున్నప్పుడు అతని పెదవుల మీద చిరునవ్వు లీలగా మెరిసింది. కనీసం థాంక్స్ అన్నా చెప్పకుండా పోతున్న అతని ప్రవర్తన వారికి ఆశ్చర్యం కలిగించింది.

'ప్రసాద్ గారూ! పోనీ మాతోపాటు రండి, భోంచేసి మా రూములో పడుకొందురుగానీ' అన్నాడు శర్మ.

'లాభం లేదు. రాను. ఈ బీచీలో తోవ తోచని వారు ఇంకా ఉంటారు. అన్నాడు ప్రసాద్ ఆ చీకట్లోకి కలిసిపోతూ.

—oOo—

# 6

# సమవృత్తం

నరుడు : ఓహో! ఏమిటిక్కడ యింత చల్లగావుందే! అరే! గాలి, ఇది గాలేనా? గాలే. ఇలాచేతి కందు తున్నదేం? ఇంత మెత్తగా దూదికంటే...దూదికాదు పట్టు, పట్టుకాదు, ఏదీకాదు. అయ్యో నాకు మాటలు రావండే! ఓ! అదేమిటి? చంద్రుడు ఆ కొండమీద కెక్కితే అందేలావున్నాడు. ఇవి రాళ్ళు కావే! మెరుస్తున్నాయి, ఎర్రగా, నల్లగా, నీలంగా, పచ్చగా. ఇన్ని వజ్రాలు, వైడూర్యాలు, మణులు, లక్షలు, కాదు కోట్లు, కాదు కాదు ఎన్నో! ఎన్నో!! నాకు మాటలు గుర్తుకు రావటంలేదు. నా శరీరం యిట్లా మెరుస్తున్నదేం? ఇంద్రనీలాలు కరిగించి నావంటికి పులిమినట్లున్నారు. అహో! మనుషుల రొద, జీవిత సంఘర్షణలు-ఏమీ లేవల్లేవున్నాయి యిక్కడ. ఆఁ...ఎక్కడో విపంచిని ఎవరో మీటు తున్నారు.

నారి : నేనెక్కడ ఉన్నాను! ఇదే లోకం! నాకేమీ అర్థం కావటంలేదే! చంద్రుడు యిక్కడ -యీసర

స్సులో-పాపం స్నానం చేస్తున్నాడల్లేవుంది...

అయ్యో! చంద్రుడు యిన్ని ముక్కలై పోతు న్నాడేం? పొరపాటు. సరస్సులో కాదు. అదుగో! అక్కడ ఆ కొండమీద వున్నాడు. ఈ కొండమీదవి రాళ్ళు కావల్లే వున్నాయి. బంగారు సుద్దలు. అబ్బా! నాకు కావల్సినన్ని సొమ్ములు. ఈ కొలనుల్లోవి, తామరలుకావే! ముత్యాలు తాపడం చేసిన పచ్చల పళ్లాల్లా వున్నాయి. అబ్బో ఇంతబంగారము మొయ్య లేను. ఏమి తీసుకోనేది? ఏమిటా మూలుగు??... మూలుగు కాదు. ఎవరో, అదే రాగమో అర్థం కావటం లేదు. ఆ పాట, నేను ఎక్కడా విన్నట్టు లేదు.

నరుడు : ... ఉశ్ ... అమ్మా... నాకాళ్ళు నొప్పిగా వున్నాయి. ఈ తామరాకులపై పడుకుంటా, ఎంత హాయి! స్ఫటికాల్ని కరిగించి పోసినట్లున్నారు.

* * *

గొంతు : అందంగారూ...మిమ్మల్నే! యీమధ్య కన పడటం లేదేం?

అందం : ఒహో! ధనంగారా! నమస్కారాలు!! పొర పాటు. నిద్రపోయినట్లున్నారు, చూడండి...కొండల కవతల, వాగులమీదగా, ఆ చివర అడవులు,

సుదూరంలో భూమ్యాకాశాలు కౌగలించుకొన్నవే, అక్కడనుంచి ఇక్కడదాకా నేనే. అంతా నేనే. నేను లేంది ఏదీలేదు. నువ్వులేంది నేనున్నాను. నేనులేంది నువ్వులేవు.

ధనం : ఆగు. అబద్ధం. గర్వం. నేనులేంది ఒక్కక్షణం జరగదు. మహాయుద్ధాలు నావే; సర్వనాశనం, అభ్యుదయం రెండూ నాలోనే వున్నాయి. నువ్వు సాధించలేంది నాకు సుసాధ్యం.

అందం : అజ్ఞానం. నువ్వు అణువ్వు. కీటకానివి. చూడు. అనంతనీలాల చివర, దాహంతో వాలిపోయిన, ఆకాశపు పెదవుల సవ్వడి నీకు వినిపిస్తుందా? మేఘాల వలువలు ధరించి, నీలి ఆకాశాల ఆలింగ నంలో— తన్మయత్వం చెందే పర్వత కొనల్ని నువ్వు తాక గల్గుదువా? గుహాంతరాళాల్లో, చిక్కటి చీకట్ల చివర్ల నునుపును, నువ్వు స్పృశించగల్గుదువా? నా మూలంగా ఎన్ని యుద్ధాలు రాలేదు? ప్రతి క్షణం మారే నాలో అభ్యుదయం వుంది. కాని నువ్వు కదలవు. నా అభ్యుదయమే నువ్వు. నా చిహ్నమే నువ్వు.

ధనం : ఆగు. చాలు. నా చెవుల్లో రొదచేస్తున్నావు అసభ్యాలతో. నా గురించి నిన్ను గడ్డిపరకగా చూస్తారు. ఈ సంగతి నీకు తెలియదల్లేవుంది.

అందం : ఛీ. వాళ్లుమూఢులు, జడులు, క్షుద్రకీటకాలు. ఆ రెండుకళ్ళు ఎందుకు సృష్టించబడ్డాయి! నాకోసం, నన్ను తాగటానికి, నన్ను ఆస్వాదించటానికి. అంతే. నిన్ను నాకోసం వినియోగిస్తారు. నేను నిన్ను ఖరీదు చేస్తాను. నువ్వు— నా బానిసవు.

ధనం : మాటలు తిన్నగా రానియ్యి. నీలో అందముందని వొప్పుకుంటున్నాను. అదీ ఏకొద్దిక్షణాల్లోనో. నీ జీవితమంతా ఎప్పుడూ, శరీరాన్ని పీక్కుతినే చలీ, వడగాలులూ, తుఫాన్‌లూ నిన్నుచూస్తే రోత, భయం, అసహ్యాపడతారు. నేను వారికి ఆశ్రయ మిస్తాను. రక్షిస్తాను తెలుసా?

అందం : పిరికివాళ్ళు. వసంతాల్లో నన్నుచూచి మెచ్చుకొనేవారున్నారు; నిజమే....తుఫాన్‌లా.....నీది చాదస్తం. ఆ తుపాన్‌లో ఎంత అందంవుందో దాక్కునే వాళ్ళకు ఏమి తెలుస్తుంది! ఆ ప్రళయ తాండవంలో నా శరీరపువొంపుల కదలికలు, నా జుత్తు నాట్యంచూచి ఆనందించేవారున్నారు. దాన్ని భీభత్సము, భయానకము, భీకరం అనేవారు పిరికివాళ్ళు. నువ్వు పిరికివాళ్ళకు ఆశ్రయమిస్తావు. వాళ్ళకంటే చూడు...అటుచూడు బాగాచూడు (తుఫాన్ హోరు) ఆ చెట్లు, వాగులు, అడవులు, నదులు, సముద్రాలు, అన్నీ నాతోపాటు ఎట్లా తన్మయులై

నాట్యం చేస్తున్నాయో చూడు...బాగా చూడు.
ఇప్పుడు అవి అలసి రొప్పొచ్చి, హాయిగా, సుఖంగా
నిద్రపోబోతున్నాయి.

ధనం : ఈ రత్నాలు చూడు. యీ ముత్యాలు, కెంపులు, రవ్వలు, గరుడపచ్చలు, ఇవన్నీ నేను. వీటిల్లో ఎంతవిలువుందో నీకేం తెలుసు? దీని కొక్క దానికి నువ్వు సరిరావు. లోకం వీటిని కావలించుకుంటుంది.

అందం : (హేళనగా) వాటిల్లో ఆ తళుకు, వెలుగు, వాటిమంచి చిందే కోటానుకోట్ల కిరణాల తుంపులు నేను. ఆ మెరుపులు, పెట్టేగిలిగింతలు లేకపోతే నీకూ రాళ్ళకూ విలువ ఒక్కటే.

ధనం : నువ్వు మాటలు నేర్చినదానివి. గయ్యాళివి. ఒక మధ్యవర్తిని పిల్చుకొస్తాను. మనలో ఎవరు అధికులో తీర్పుచెప్తాడు. ఎక్కడన్నా ఒకనరుణ్ణి...

అందం : వొద్దు. వాళ్ళొద్దు. వాళ్ళకే న్యాయం తెలియక యింకోరి దగ్గరకు పోతారు. రెండు పడవల మీాద నుంచుంటారు. నువ్వు కావలిస్తే నీ దగ్గర, నేను కావలిస్తే నాదగ్గర మోకరిల్లుతారు. అటూ యిటూ వుంటారు, వాళ్ళొద్దు.

ధనం : అడుగో ఆకలి...అటు పోతున్నాడు. పిలవనా?

అందం : పిలు.

ధనం : ఏమండోయ్ ఆకలిగారూ...ఇటూ—ఇక్కడ ఇలా రండొకసారి. చిన్నపని-ఇప్పుడే వెడుదురుగాని.

ఆకలి : (బరువుగా నిట్టూర్చి) ఓహో మీరా-సంగతే మిటి.

ధనం : అసలు జీవితమంటే నేనంటనూ...

అందం : కాదు. జీవితమంటే భూత భవిష్యద్వర్తమానాల సంఘర్షణ లంటాను నేను. ఔను కదూ?

ఆకలి : మీరు యిలా వాదించుకుంటే నా మధ్యవర్తిత్వం ఎందుకు? మీ వాదనంతా గాలి మోసుకొపోతుంటే విన్నాను. అటు చూడండి-ఒక నరుడు...

నరుడు : ఇక్కడ యింత హాయిగావుంటే! ఒక నారివుంటే యీ హాయినంతా కప్పుకొని ఆనందంగా...ఆహాహా!

ఆకలి : ఓ! అటుచూడండి—ఒక నారి...

నారి : ఈగడ్డి వాసనేస్తోంది. ఇదేం వాసనో, నేనెన్నడూ పీల్చలేను. ఈ కొత్తవాసనల్లో, యీ రత్నాల పరుపు మీద ఒక నరుడుంటే...అబ్బో! నే నూహించలేను.

ఆకలి : ఆ కొలనులో ఒక నరుడు కలలు కంటున్నాడు. ఆ పచ్చికమీద ఒకనారి స్వప్నాలతో ఆడుకుంటున్నది. వారిద్దరూ మన నాటకానికి జీవంపోస్తారు. మీరు వెలుగు నీడలుకండి. నేనూ మారుతాను. మీరు వార్ని వెంబడిస్తూ వారి సంభాషణలు వినండి.

[ఆకలి తనను తాను చేత్తో స్పృశించుకుం టుంది. రెండు నీడలుగా విడిపోతుంది. ఒకనీడ నరుడిలో లీనమై, రెండోది నారి వైపు నడుస్తుంది]

నరుడు : ఇదేమిటి నా కడుపులో—ఇవి చేతులు, ఇవి కాళ్లు, యిది యిది, అన్నీ నాశరీరపు అవయవాలు. కడుపులో ఎవరో గెలుకుతున్నారు. ఈ నీళ్ళు యింత చీదరగా వున్నాయేం? తాగలేను. ఏ మైనాతినాలి. పేగుల్లో ఏమిటో మంటగావుంది...ఆకలి...ఆహారం కావాలి.

నారి : నాలో యిదేమిటి? ఏదో వికారంగా వుంది. నాకు నరుడు కావాలి నేనీ ఒంటరితనం భరించలేను. నరుడు, నరుడు కావాలినాకు!

నరుడు : ఆకలి...ఆకలి...

నారి : అడుగో నరుడు! నా అందానికి దాసుడు. నా కళ్ళల్లోనుంచి ప్రవహించే నవ్వుల నదుల అలల మీద నావ. నా వొంపు సొంపుల్లో ఆడుకునే పసి వాడు. నాకలలు నిజం. నరుడే ఇటే వస్తున్నాడు.

నరుడు : ఆకలి...ఆహారం కావాలి.

నారి : చూడు...నన్ను చూడు. నేను నారిని, ఏమిటి కలవరిస్తున్నావు? కళ్ళు తెరు. నిద్రలే. ఈ లోకం చూడు. మేఘాలు చేతి కందుతున్నాయి. వీటిమీద పడుకుందాం. గాలిచూడు! ఈలవేస్తూ పాడుతున్నది.

ఓ నరుడా నిద్రలే.

నరుడు : ఆకలి...గర్భగోళంలో లావా ఉడుకుతున్నది.

నారి : ఇవిగో! రత్నాలు, కెంపులు, బంగారు సుద్దలు, రాసులు రాసులుగా వున్నాయి. ఆ పచ్చలువూసి బరువుగా వూగుతున్న చెట్లుచూడు.

నరుడు : (దీర్ఘంగా నిట్టూర్చి) ఆకలి...మాట్లాడలేను.

నారి : ఆకలేమిటి? ఆహారమేమిటి? నేనెన్నడూ విన లేదే యీ మాటలు! ఏ భాషలో వున్నాయీ పదాలు? నాకు తెలిసిన ఏ భాషలోకూడా యీ పదాలులేవే! ఏవో కొత్తగా వున్నాయి, వాటి అర్థం నీకు తెలుసా?

నరుడు : ఆకలంటేనా? నాకు చెప్పటానికే చేతకాదు. ఇక్కడ...దీన్లో మండుతున్నది. పేగుల్లో...మాట్లాడలేను. ఆహారం కావాలి...

నారి : ఆహారం...ఆకలి. నాకేం అర్థం కావటంలేదు. ఆహారమంటే, యీ కెంపులా, పచ్చలా, బంగారు సుద్దలా? ఆ సరస్సులో ముత్యాలు పొదిగిన పచ్చల పళ్లాలా? ఆ కొండమీద చంద్రుణ్ణిచూడు. చేతికందుతున్నాడు...అదా...? ఆకలంటే!

నరుడు : (పెద్దగానవ్వి...) అవి కెంపులూ కావూ వజ్ర వైడూర్యాలూ కావు. ఈ గులక రాళ్లను చూచి

వజ్రాలు వైడూర్యాలంటున్నావు. ఈ బండరాళ్లను చూచి బంగారు సుద్దలంటున్నావు. నీది భ్రమ-నాది ప్రమ.

నారి : అయ్యో! నరుడా!! ఎలాంటి వాడవు ఎలా అయిపోయ్యావు! నీకు మతిచెడింది. ఇటు చూడు నావేపు.

నరుడు : నాకు ఆహారం కావాలి. పోతాను దానికోసం.

నారి : నరుడికి పిచ్చెక్కింది. చేతికందుతున్న చంద్రుణ్ణి, మేఘాల మెత్తదనాన్ని, నిండుపైరులా ఊగుతున్న వెన్నెల్లోనుంచి వొచ్చే యీ గడ్డివాసన్ని, నీటిలో మిళితమైన సన్న నా శరీరపు వొంపులు ఏమీ అర్థం కావటంలేదు. ఏదో ఆకలి ఆహారం అంటున్నాడు. ఇన్ని సంపదల్లో అది లేదా?

నరుడు : నీకు పిచ్చెక్కింది. ఈ సంపదల్లో అవి వున్నాయో లేవో నాకు తెలియదు. ఆ చెట్లల్లో గుబురుగా ముసురుకొని మెరుస్తున్న మిణుగురుల్ని చూచి 'పచ్చలు పూశాయి కాశాయి' అంటు న్నావు. ఈ వెన్నెల్ల చివర ఎక్కడో చంద్రుడుంటే చేతికందుతున్నా డంటావు నీది పిచ్చి, భ్రమ. నాకు ఆకలేస్తోంది. ఆహారం కావాలి...ఆహారం (మాట దూరమైపోతుంది)

*　　*　　*

ఆకలి : ఆ...ధనంగారూ ! ఏమండోయి అందంగారూ ఆ...అట్లా...పూర్వపురూపాలు ధరించండి. ఆ... ఇప్పుడు అర్థమయిందా ?

ధనం : నాకు అర్థం కాలేదు.

అందం : నాక్కూడా— యీ నాటకం అర్థం కాలేదు. విడమరచండి.

ఆకలి : చెప్తా వినండి. మీ రిద్దరూ గర్విష్టులు. మీకు అహంభావ మెక్కువ. నేను లేంది నువ్వు లేవు. నువ్వు కూడా లేవు. నాలోనుంచే యీ కోటానుకోట్ల సమస్యలు ఉద్భవించాయి. నేను యీ అనంతమైన సమస్యలకు తల్లిని తండ్రిని. నన్నే సృష్టించకపోతే యీ ప్రపంచమే లేదు. ఒకరితో ఒకరికి పనే వుండదు. నేనుంటేనే మీరందరూ అవసరం. మీరు...అందరూ నాకు దాసులు; బానిసలు. యీ సకలచరాచరానికి నన్ను పాలకుణ్ణిగా సృష్టించారు. (నవ్వు...సుదూరంలో నవ్వు పల్చబడుతుంది)

